శ్రీ రామాయనమః

# పతి

( హిత చర్యలు )

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

వాసుదాస స్వామి



శ్రీరామాయనమః



శ్రీరామాయనమః

# ఆర్యచరిత్రరత్నావళి

## పతిహిత చర్య




వావిలికొలను సుబ్బారాయ
విరచితము



శ్రీశ్రీశ్రీ "ఆంధ్రవాల్మీకి"
శ్రీ వావిలికొలను సుబ్బరావు (వాసుదాస స్వామి)
శ్రీ రామసేవా కుటీరము, వాల్మీకి ఆశ్రమము (శృంగిశైలము),
ఒంటిమిట్ట, కడప జిల్లా.

శ్రీరామాయనమః

# ఆర్యచరిత్రరత్నావళి

## పతిహిత చర్య

నాయన ! కుమారదశయందు నీవు నడచుకొనవలసిన పద్ధతులన్నియుఁ గుమార హితచర్యయందుఁ దెలిపితిని. ఇఁక 3-4 మాసములలో నీకు నిషేకముహూర్తము జరుగునని వింటిని. నిషేకముహూర్తమైనది మొదలు నీకు గృహస్థుఁడను పేరువచ్చును. అది మొదలు నీవు ద్వితీయాశ్రమ ధర్మము సార్థకము చేయవలసియుండును. నేను జెప్పినట్టు బ్రహ్మచర్యము చక్కఁగ నడపినవానికి గృహస్థధర్మము చక్కఁగ నడుపుట విశేషకష్టముకాదు. బ్రహ్మచర్యవ్రతభ్రష్టుఁడు సర్వ పురుషార్థముల భ్రష్టుఁడనియే నమ్ముము. నీవు బ్రహ్మచర్యమును జక్కఁగ సాధించితివను సంతోషముతో నీకు గార్హస్థ్యధర్మము బోధింప యత్నించితిని.

ఆరోగ్యమును గాపాడుకొనుటకు మార్గము తెలియక యిచ్చవచ్చినట్టు ప్రవర్తించువా రెట్లు చెడుదురో యట్టులే గృహస్థధర్మమెట్టిదో భార్యయెడల నెట్లు ప్రవర్తింపవలయునో ముందుగఁ దెలిసికొనక యా యా సమయమునకుఁ దోచినట్లెల్లఁ బ్రవర్తించువారు సంసారసుఖ మనుభవింపలేక దిక్కు మాలిన సంసారము పాడు సంసారమని తిట్టుచు నోడనడుపఁ దెలియని యారకాటివలె దుఃఖముల పాలగుచున్నారు. కావున గృహస్థధర్మమును నీ విప్పుడే తెలిసికొనుట యత్యావశ్యకము. ఒకానొక పల్లెటూరి బ్రాహ్మణ బాలుఁడు కృషి లోనగుకార్యములఁదిరుగుచు బ్రాహ్మణాచార మెట్టిదోసంధ్య యననేమో తెలియక యిప్పటి యనేక బ్రాహ్మణ బ్రువులవలె వీఁపు గోకుకొనుటకును మృచ్ఛకటికలో దొంగ బ్రాహ్మణుఁడు చెప్పినట్టు లుపయోగించుటకును జందెమును వేసికొని యుండెను. వీని భార్య రజస్వల యగుటచే నితని యత్తమామలు గర్భాధాన ముహూర్తమునకు రమ్మని యితనికి నుత్తరము వ్రాసిరి. వాఁడును బయలుదేఱి పోవుచుండ సాయంకాలమగునప్పటికి కొక యే అడ్డము వచ్చెను. అచ్చటఁ దోడి బాటసారులు బ్రాహ్మణులు సాయంకాలమైనది సంధ్యవార్చి పోవుదమని వారిలో వారు మాటలాడుకొని పూర్వ కృత్యముగ మలవిసర్జనమునకై చెట్లమఱుఁగునకుఁబోయిరి. బ్రాహ్మణులు సంధ్య వార్చవలయుననుకొనుట వినినవాఁడును వారు చెట్లచాటునకు మలవిమోచనమే సంధ్య వార్చుటగాఁ దలఁచి యిన్నాళ్ళకిది నేర్చుకొంటిని. ఇఁక నత్తగారింటికిఁ దలఁచి యిన్నాళ్ళకిది నేర్చుకొంటిని. ఇఁక నత్తగారింటికిఁ బోయిన భయము లేదనుకొని వాఁడు నట్టులే బాగుగ సంధ్యవార్చి కాలుసేతులు కడుగుకొని బయలుదేఱి యొకటి రెండు దినములలో నత్తగారిల్లు చేరెను.

తరువాత శుభప్రస్తుతము జరిగెను. ఆనాఁటి రాత్రి దంపతులను బడుకటింటిలోనికిఁ బంపిరి. ఆనాఁ డత్తగారింటఁ జేసిన పిండివంటలవంటి వేన్నఁడు తిననివాఁడుగాఁడు గావున వాఁడు కుక్షివంచనము చేయక కఱవేమో కాలమేమో యని కడుపాఱ భుజించెను. ఆ కారణమున నర్ధరాత్రమున వాఁడు బహిర్భూమికిఁ బోవలసివచ్చెను. అప్పుడు మంచము పట్టె నొకదానిని గఱచుకొని పండుకొని నిద్రపోవుచుండు భార్యను లేపి ఓసి నేను సంధ్య వార్చవలయును నీళ్ళు దెమ్మనెను. అది నిజమే యనుకొని యొక తట్టయును బంచపాత్రముతో నీళ్లు తెచ్చియుంచి మరలఁ బండుకొని నిద్రించెను. దానిని నిద్రింపనిచ్చి యా తట్టలో వాని సంధ్య వాఁడు వార్చి మరల భార్యను లేపి సంధ్యవార్చి యయినది. దానిని వెలుపలఁ బాఱఁబోసి రమ్మనెను. అదియును నిద్దురమత్తున లేచి తమ యింటి వాడుక ప్రకారము తట్టను తొలసి చెట్టుందు తొలసమ్మలోఁ గ్రుమ్మరించి మరల వచ్చి పండుకొనెను. చీఁకటి యుండగానే యా పిల్లతల్లి నిద్దురలేచి కాలకృత్యములు దీర్చుకొని తొలసమ్మలో నీరు పోసి దానిని నెత్తి మీఁదఁ బ్రోక్షించుకొనెను గుప్పున కంపు కొట్టఁగా నేమియిది యని విచారించి యల్లుని సంధ్యావందన వాసనయని తెలిసికొని తలకు స్నానము చేసెను.

నాయనా ! యీ విధముగ సంధ్యవార్చువా రిప్పుడనేక బ్రాహ్మణులు కలరు. అది నీకును దెలిసిన విషయమే. ఇట్టిజ్ఞానమే దాంపత్య విషయము నందుఁగూడఁ గలవా రనేకులుందురు. కాలము కామమోహితమై కుమార హితచర్య యందుఁ జెప్పిన దురాచారములకుఁ బాలుపడి యున్నది. భార్యాభర్తృ సంయోగము పశు సంయోగమువంటిదని వారి యభిప్రాయము. విషయమునందుఁ బశువుల యుపమానము చెప్పుట తప్పు. పశువులు స్వభావముగఁ బ్రవర్తించుటచే ఋతువేళయు స్త్రీజాతి చిత్తవృత్తియుఁ దెలిసి ప్రవర్తించును గాని మనుష్యులవలె విధినిషేధము లెఱుఁగక ప్రవర్తింపవు. పశువులకు జ్ఞాన మనునది లేకుండుటచే భార్యాభర్తృ నియమము లేక కలయును. తాఁకు తప్పు తెలిసికొని ప్రవర్తింప భగవంతుఁడు జ్ఞానము నిచ్చియుండఁగా దాని నుపయోగింపక

విధి నియమమును పాటింపక స్వైర విహారమువలనఁ గలుగు నష్టము లాలోచింపక తిరుగువారు పశువులట్టివారని యెట్లు చెప్పవచ్చును.

కుమార హితచర్యయందుఁ దెలిపిన జన్మోద్దేశములను స్మరింపుము. శాశ్వతానందమగు మోక్షమును సంపాదించుటకు దేహారోగ్యము సంతానము రెండును సాధనములని చెప్పితిని. ఈ యారోగ్యము సంతానము అను నవి రెండును మోక్షమున సంపాదింపనే కోరవలయునుగాని యాత్మభోగార్థమునకుఁగాదు. పరుల దుఃఖపెట్టుటకును గాదు. కావుననేగదా వివాహకాలమున వరుఁడు ధర్మయుక్తముగ సంతానము నీయందుఁ బడయుటకై నిన్ను వివాహమాడుచున్నానని వధువుతోఁ జెప్పును. సంధ్యావందనమందు దీర్ఘాయువు కావలయునని కోరి మంత్రములు చెప్పుటయు మోక్ష సాధకములగు కార్యములు చేయుటకేగాని యర్థ కామాతురుఁడై బ్రతుకుటకుఁ గాదు. ఈ విషయము నీ వే నిమిషమందును మఱవవలదు. సర్వదాజ్ఞప్తి యందుంచుకొనుము. ఆరోగ్యమను గోడలమీఁదనే సంతాన మోక్షములను మిద్దెమేడలు నిలిచియున్నవి. ఆరోగ్యము లేకున్న సంతానము లేదు. ఉ ండెనా దుఃఖమునకే కారణము. ఆరోగ్యము లేకున్న మోక్షమును సాధింప సాధ్యపడదు. కావున నారోగ్యము కాపాడుకొనుచు విద్యాధనము సంతానము లోనైన సమస్త పురుషార్థములు సంపాదింపవలయును.

'ఇల్లు ఇల్లుగాదు, ఇల్లాలే యిల్లు' అని పెద్దలు చెప్పిరి. గృహమనఁగా భార్యయే కాని నాలుగుగోడల నడిమిప్రదేశము మాత్రము గాదు. భార్యకలవాఁడే గృహస్థుఁడుగాని యింటిలో నితరులు నూర్వురుండినను పురుషుఁడు గృహస్థుఁడు కాఁడు. భార్యకలవాఁడను భార్యతోడ సంసారము చేయుఁడని యర్థమే కాని వివాహము మాత్రము జరిగినవాఁడు కాఁడు. కావున నీకు నాలుగు సంవత్సరములకు మునుపే వివాహము జరిగినను గృహస్థుఁడ వింకఁ గాఁబోవుచున్నావని యంటిని. పతి యనఁగా బాలించువాఁడు గృహపతి గృహమును బాలించు వాఁడు. ఇట్లు చెప్పుటచే గృహమున భోజనాది కార్యములకు వలసిన పదార్థముల నెల్లఁదెచ్చును భార్య సుఖదుఃఖముల నెల్ల విచారించి యామెను సంతోష పెట్టువాఁడు గృహపతియని యేర్పడెను. ఇల్లాలు బాగుండిననే యిల్లు బాగుండును గనుకను, నింట గెల్చి రచ్చ గెలువవలయునను సామెత యుండుటయు, గృహకృత్యముల విచారించు భారమును నీకంటెఁబెద్దవారు వహించియుండుట చేతను, నీవు నీ భార్య విషయమున బ్రవర్తింపవలసిన విధమును దొలుతఁ దెలిపి తరువాత గృహరక్షణమునకుఁ గావలసిన ధనార్జనాదికార్యముల గుఱించి నీకుఁ గర్తవ్యమును దెలిపెదను. నీవు విద్యయందును. ధనార్జన మందును, వ్యవహారములందును నెంత సమర్థుఁడవైనను గృహమున సుఖము లేదేని యాజన్మాంతము నిరంతర దుఃఖివే గనుక నింటిసుఖమునె దొలుతఁ జెప్పఁ దలఁచితిని.

నేను గృహస్థుండ నిఁకఁగదా కాఁబోవుచున్నాను. ముందుగనే యేల నాకు వివాహము జరపఁబడెనను సందేహము నీకుఁ గలుగవచ్చును. ఆ విషయమై కొంత చెప్పెదను.

ఏ కార్యమునకుఁగాని యిల్లు కట్టుటకును బావి త్రవ్వుటకును బరీక్షలయందుఁ గృతార్థుఁ డగుటకును దేనికైనను బూర్వ ప్రయత్నము కొంత కావలసి యున్నది. దాహమైనప్పుడు బావి త్రవ్వవచ్చునా ? అప్పుడు తలఁచుకొని యప్పుడు చేయు కార్యములందుఁ బ్రమాదములు పెక్కు లు జరగును. కావున వివాహమునకును బూర్వప్రయత్న ముండవలసినదే. ప్రాయమువచ్చి తమంతఁ దాము చేసికొను వివాహములందును బూర్వ ప్రయత్నము లేదని తలఁపకుము. రజస్వలావివాహములు చేయు శూద్రాదులందును వివాహమునకు గర్భాధానమునకు నడుమ మూఁడు దినముల విరామమైన నుండును, వీధిలో నొక మగకుక్క యాఁడుకుక్క వెంబడిపోవుట దాని తోఁక వాసనచూచుట యడ్డ మడ్డము వచ్చుట, యది మెఱిగినను పైపడి కఱవవచ్చినను సహించుకొనుట యివన్నియుఁ జూచితివేని యని సంగమ పూర్వకార్యములని తెలిసికొందువు. ఇట్టులే కేడెలు పక్షులు చేయును. మగకుక్క లాఁడుకుక్క ల వెంటఁ దిరిగి లాలించి బేలించి దాని చిత్తముపడయునట్లే పాశ్చాత్యులందును గర్భాధానమునకు ముందు "కోర్టింగు" అని "ఊయింగు" అని కలదుగదా. మగవాఁడీ 'యింగు'లలో 5-6 మాసములు కడపుటయుఁ గలదు. కాఁబట్టి మనలో గర్భాధానమునకు వివాహము పూర్వాంగముగ నేర్పడెను. దీనివలనఁ జాలమేలు గలదు. పశుపక్ష్యాదులలో వివాహవిధినిషేధములు లేవుకదా? మనుష్యులలో నేల యుండవలయునని సందేహింతువా వినుము. పశుపక్షాదులకు జ్ఞానము లేమినిగదా యేకార్యమేల చేయుచున్నావో వానికిఁ దెలియదు. స్వభావమును బట్టి తత్కా లమున కేది యావశ్యకమని తోఁచునో యా కార్యమును జేయుచుండును. దేహరక్షణమేల చేసికొనుచున్నవో సంతానము కలుగనేల ప్రవర్తించుచున్నవో వానికిఁ దెలియదు. మనుష్యుల కట్టు గాదు. భగవంతుఁడు మనుష్యులకు జ్ఞానము నిచ్చియున్నాఁడు. దానివలన వాఁడు చేయు ప్రతికార్యమునకుఁ గారణమును నా కార్యమును జేసినఁ

గలుగు మేలు గీళ్లును జక్కఁగ నాలోచించి తెలిసికొను శక్తిగలవాఁడగుచున్నాడు. దీనివలననే దేహరక్షణము సంతానలాభ మీరెండును భగవత్ప్రాప్తిఁగాంచి శాశ్వతానందమనుభవించుటకే కాక స్వలాభార్థము కాదనియు ఆ రెండును ఆ ప్రయోజనమునకుఁగాక మఱియొక ప్రయోజనము గోరి చేసినఁ గీడుకలుగుననియు నతఁడు తెలిసికొనఁ గలిగెను. అంతేకాదు. ఉద్దేశ్యము శాశ్వతానందమయ్యేనేని దానిని శీఘ్రముగ సుఖముగ సంపాదించు మార్గమేది? ఏ కార్యము లెట్లుచేసిన దానిని సంపాదింపఁగలము? ఏ కార్యము లొనర్చిన దానిని సంపాదింపలేము? అని యాలోచన కలుగఁగా దానికిఁ దగిన మార్గములన్నియు వాఁడే యేర్పఱుచుకొనెను. మన పెద్దలు నానా మార్గములు పరిశోధించి చూచి తుదకు క్షేమకరమైనది. నిరపాయమైనది. యగు మార్గము సిద్ధాంతీకరించిరి. ఆ మార్గముననే మనమిన్ని యుగములుగ నడచి యేహానియు నొందకున్నాము. అంతటి యాలోచనా బలములేనివారు నానా మార్గము నవలంబించి వాని వలనఁ గలుగు దుఃఖఫల మనుభవించుచు మనమార్గమే బాగున్నదని యిప్పుడీప్పుడు తెలిసికొనుచున్నారు. మనలోని యేర్పాటులవలని మేలు నాలోచింప లేనివారు కొందఱు పొరుగింటి పుల్లగూర రుచియను సామెతకు లక్ష్యభూతులై కామకారులగుటచే స్వేచ్ఛా వర్తనముకలవారగుచున్నారు. దానిఫలము వారు ననుభవింతురుగాని తప్పించుకొనలేరు. అనుభవించు వారిని జూచుచున్నాము కదా.

ఆఁకలి యగుట స్వభావధర్మము. ఆఁకలిగొనిన పశుపక్ష్యాదులు తత్కా లమున నేవి లభించిన నవి తినునుగాని ముందుగ సేకరించి యుంచుకొనవు. చీమలు మొదలైనవి ముందుగ సేకరించు నవియుఁ గలవు మనమో దున్నివిత్తి పండించి యారోగ్యకరములైన వానిని గ్రహించి యారోగ్యకరములుగాని వానిని వదలి పెట్టుదుము. అట్లులే సమస్త ప్రాణులకు సంతానకాంక్ష దైవికము. దైవికమగుట కేవల పవిత్రము. ఆ కాంక్షియందు దోషము లేదు. ఆ కాంక్ష దీర్చుకొను మార్గములు స్వభావముననుసరించి పోవునని సుఖప్రదములు. స్వభావము ననుసరింపనివి దుఃఖప్రదములు. జ్ఞానము కలవారు స్వభావమిట్టిదని శాస్త్రపఠనముచేతనో స్వబుద్ధిబలముచేతనో తెలిసికొని ప్రవర్తించి సుఖింతురు. విపరీతజ్ఞానులు చెడుమార్గముల నడచి దుఃఖపడుదురు. స్వబుద్ధిచే సర్వము తెలిసికొనుట కష్టసాధ్యము కావునఁ గార్యాకార్యములకు శాస్త్రము ప్రమాణము. కావున గృహస్థధర్మము లేవని శాస్త్రములఁ జెప్పఁబడినవో యని నీవు తెలిసికొని ప్రవర్తించిన సుఖింతువు.

పాశ్చాత్యులవలెఁ బురుషులు సంపాదన సమర్థులైనపుడు వివాహ మేల చేసికొనరాదు ? విద్యార్థి దశయందే యేల వివాహము చేసికొనవలయును? అను సందేహము నీకుఁ గలుగవచ్చును. ఆ విషయమై కొంచెము చెప్పెదను.

విద్యార్థిదశయందు వివాహము చేయు దురాచారము కలిబలాతిశయమున మనలో ముదిరినది అది శాస్త్రీయమార్గముకాదు. విద్యచాలించువఱకు వివాహము చేసికొనరాదనియే శాస్త్రమునఁ గలదు. దురాచారము ప్రబలుటకుఁ గారణము విను. పూర్వపు విద్యార్థిదశకు నిప్పటి విద్యార్థి దశకు హస్తిమశకాంతరము పూర్వపు విద్యార్థిదశ మంచినీళ్ళు వంటిది. ఇప్పటి విద్యార్థి దశ కాఫీనీళ్ళు తేయాకు నీళ్ళు సారాయి వంటిది. పూర్వపు విద్యార్థి పఱుపుపైఁ బండుకొని యెఱుఁగఁడు. మత్తునిచ్చు పదార్థములు నుద్రేకము కలిగించు పదార్థము లెఱుఁగఁడు. గంధము పూలు తాంబూలము యౌవనస్త్రీ సంభాషణము నెఱుఁగఁడు. విద్యనేర్చుటకుఁ బ్రథమఫలము జ్ఞానమని యతని యుద్దేశము. గురు శుశ్రూషచే విద్య సంపాదించుచుండెను. సౌఖ్యమునకు విద్యకు మిక్కి లి దూరమని సర్వవిధభోగములు వర్జించి యింద్రియములను దన స్వాధీనమందుంచుకొనినవాఁడు. పూర్వపువిద్యార్థి యస్ఖలిత బ్రహ్మచర్యవ్రతము జరుపువాఁడు. ఈ విద్యార్థిదశ యధమ పక్షము 12 సంవత్సరములు. 8వ యేఁటను నుపనయన మైన 20వ యేఁట విద్యార్థిదశ పూర్తియగును. తరువాత వాఁడు వివాహము చేసికొనుచుండెను. వాఁడు జితేంద్రి యుఁడు కావున భార్యయందుఁదప్ప, మఱియెప్పుడు వీర్యము స్ఖలనము గానిచ్చువాఁడు కాదు.

ఇప్పటి విద్యార్థిదశ వర్ణనాతీతము, వేలకొలఁదిగ నుండు పట్టభద్రులలో జ్ఞానమునకై చదువు నేర్చినవా రెందఱున్నారో చెప్పుము. ఆ విద్యవలన జ్ఞానులైనవా రెందఱున్నారో చెప్పుము. ఫలమునుబట్టి చూచిన నిప్పటి విద్యాభ్యాస పద్ధతు లవిద్యాభ్యాసపద్ధతులని చెప్పుట తప్పుగాదు. ఈ విషయమై నా యభిప్రాయ మిదివరకే చెప్పితిని. అది పోనిమ్ము. విద్యార్థిదశయందు సౌఖ్యముఁ గోరనివా రెందఱున్నారు? ఆహార నిద్రానియమములు గలవా రెందఱున్నారు? భోగ్యపదార్థము లాశింపనివా రెందఱున్నారు? ఇప్పటి విద్యాపద్ధతులవలన గురు మాతాపితృ భక్తిగలవారెందఱున్నారు? నియమ వ్రతము లాచరించువా రెందఱున్నారు? ఇంద్రియ విగ్రహముకలవా రెందఱున్నారు? ఇవన్ని యెటులైన నగుఁగాక. తుదకు దేహారోగ్యము బలము సంపాదింపవలయునని యాలోచన

గలవా రెందఱున్నారు? ఎక్క డజూచినను దినమునకు 4-5 మార్లయినను కుడితితొట్టికిఁ బోసినట్లు కడుపులో నేదోయొకటి పోయుచుండువారే. ఎక్క డఁజూచినను విపరీత సుఖాసక్తులే. ఎక్క డఁ జూచినను నింద్రియోద్రేక కరములైన కార్యములు చేయువారే పెక్కు రు కానవచ్చుచున్నారు. ఈ దురాచారములవలన నింద్రియ దాస్యము ప్రధమఫలము. దీనివలననే జాతి నీతితప్పి స్త్రీలతో సంగమించుట యేర్పడుచున్నది. ఇట్టివారు గృహస్థధర్మము నేమి జరుపఁగలరు? దీర్ఘాయువులై యెట్లుండఁగలరు? కావుననే పురుషులర్ధాయువునందే మరణించుట గానవచ్చుచున్నది. వారి భార్యలు ప్రౌఢదశకుముందే విధవలగుట తటస్థించుచున్నది. అట్టివారిని దుష్టపురుషులు తప్పుత్రోవల నీడ్చుట కాస్పదమగుచున్నది. రహస్యకృత్యములు ప్రాణగండములని తోఁచినపుడు బహిరంగముగ వ్యభిచరించు నుపాయముల వెదకవలసి వచ్చినది. విధవావివాహములు ఫలములైనవి. బాల్యమునందు వీర్యస్ఖలనముచేఁ గలుగు నష్టమును బాలురకుబోధించి కామము నణంచుటకు మాఱుగ కామోద్రేకము కలిగింప సంక్షౌరకు లేర్పడిరి. పరమశత్రువైన దుష్కా మము పరమమిత్రముగా గ్రహించినపుడు సమూలము నాశమగుట యేమి చిత్రము? ఈ మహామారి యిదివఱకు బాలకులయందే వ్యాపించుచుండెను. ఇప్పుడు బాలికల యందును వ్యాపించుచున్నది. అది రజస్వలా వివాహములతోఁ బూర్ణమగును.

ఇప్పటి విద్యార్థిదశ యైదవయేట బీడీపీకెలతోఁ బ్రారంభించుచున్నది. వర్ణక్రమము సరిగాఁ జెప్పరాదని యిప్పటివిద్యాబోధన పద్ధతిగావున ఏ. బి. సి. డి. యని వరుసగఁ జెప్పనైతిని. ఈదశ యిరువది యైదవయేఁడువఱకుండును. ఈ లోపల విద్యార్థులు పడుపాట్లు మీఁద చెప్పితినిగదా. గుండెలు క్రుళ్ళఁ జదువుటకుఁ దోడు వీర్యస్ఖలనము కూడఁ గలిగిన దుర్వృత్తులకు మఱగిన మఱింత బాలురు చెడుదురని విద్యార్థిదశయందే వివాహములు చేయవలసి నట్లేర్పడెను. అట్లు చేయుటవలన నెప్పటికి వివాహమగునో యెప్పుడు భార్య వచ్చునో యని బాలురు నిరుత్సాహులై తప్పుత్రోవలఁబోవక భార్యయొకతె యున్నదికదా. మనము జాగ్రత్తగ నుండవలయునని కొందఱకైన తోఁచునట్లేర్పడినది. ఈ రెండు కీడులలో నేది తక్కు వకీడో యాలోచింపుము. వధూవరు లారోగ్యవంతులు దృఢాంగులు నై రేని కౌమార దశయందలి వివాహము లనర్థకములు కానేరవు. రామునకు 12వ యేఁటవివాహము. అభిమన్యుడు 16వ యేఁట మరణించెను. కావున 15వ యేట వివాహమై యుండవలయును. దృఢాంగులు గాక యారోగ్యహీనులైన వారికి 30 ఏండ్లకు వివాహము చేయుటయు దోషమే.

బ్రహ్మచర్యము సర్వోత్తమమైనను ఆజన్మాంతము శుకునివంటి యోగులవలెను. భీష్మ హనుమంతులవంటి బ్రహ్మచారులవలెను నస్ఖలిత బ్రహ్మచర్యము జరపుట కోటికొక్క నికైన సాధ్యపడదు. కాఁబట్టి వారిమాట యటుంచిన యెడలఁ దక్కి న లోకమంతయు సంతానకాంక్ష కలదిగానే కనఁబడుచున్నది. అది దైవవిధి. తీవ్ర బ్రహ్మచర్యము సాధింప లేనివారు ధర్మమార్గమున సంతానముఁ బడసి సంసారము తరించుట సుకరమైనమార్గము. పాశ్చాత్యులందు వివాహము లేనివారు లేరా యనకుము. వివాహము చేసికొనకుండుట మాత్రమే బ్రహ్మచర్యము కాదు. రేతస్ఖలనము కానీయకుండుటే బ్రహ్మచర్యము. పశ్చిమ దేశములలోఁ గొందఱు వివాహముఁ జాలించుకొనుటకు నింద్రియజయము కారణముగాదు. అచ్చటి స్త్రీ లనేక విషయములఁ జెడునడవడి గలవారగుటచే వారిని గట్టుకొని బాధపడలేక యూరకుండుట సుఖమని కొందఱు పురుషులు ఘోటక బ్రహ్మచారులగుచున్నారు. అది అభావవిరక్తిచే నయిన వివాహహీనత. బ్రహ్మచర్యము గాదు. పురుషులు వివాహము చాలించికొనినపుడు స్త్రీలకు వివాహము లేకుండుట సహజఫలమేకదా. వివాహము చాలింపవచ్చును. గాని కామమును జయింప వారితరమా? రేతస్ఖలనమే లేనిపురుషుఁడు లోకమున లేఁడని యుండఁజాలఁ దని యొక పాశ్చాత్యుఁడు వ్రాసెను. దానివలననే వారి కది యెంతటి దుస్సాధ్యమో తెలియనౌను. మనలో నూర్ధ్వరేతస్కు లైన కణ్వాది మహర్షు లెందరులేరు? ఆ దేశములలోఁ దృష్టిపడి యుండువాఁడు బ్రహ్మచారియేనని బ్రౌన్ దొరవారు తమ నిఘంటువున మొదటికూర్పున 'సెలిబెసి' యను మాట కర్థము వ్రాయుచు వ్రాసిరి. దుర్వృత్తు లెన్ని యనర్థకముల కాకరములగుచున్నవో చూచితివా?

ప్రతిజీవికిని సంతానకాంక్ష యేనాఁడో యొకనాఁడుకలుగును. కలుగకపోదు అది స్వభావముగా దేని వ్యర్థముగ నొక వెంద్రుకనైన జీవులయందు సృజింపని భగవంతుఁడు దానికిఁగా నేల యవయవముల సృజించును? కొంపగాలునప్పుడు కోనేరు త్రవ్వించి నట్లుగ నట్టికాంక్ష కలిగినపుడేదో యొక స్త్రీకై దేవులాడుట మేలా? సమయమున కుపయోగించుటకై తన కులగుణనీతిమతాచారములకు సరిపోవు కన్యను వివాహమై యిది మనసొత్తుని నిర్భయుఁడై నిశ్చలుఁడై యుండుటమేలా? కలిగిన వాని కాఁకలితక్కు వ దరిద్రున కాఁకలిమెండు.

అక్క ఱకు దక్కి నదానికి మక్కు వయుండునా? ఇప్పటి పురుషులకు సంపూర్ణ సంభోగశక్తి యిరువదియైదవ యేఁటcగాని కలుగదు. అప్పుడు తన కుపయోగించుటకై యొక యాఁడుదానిని రజస్వలనేకదా వెదకికొనవలయును. కన్యకతో వానికిc బనిలేదు కదా? యుక్తవయస్సున రజస్వల యయినచో నది సంభోగార్హురాలేకదా. ఋతుకాలముల స్త్రీ దొరకుట దుర్లభముగదా. అట్టి సందర్భములలోc గామధ్వజము విజృంభించి యాడెదు నీ కాలములో నెందఱు రజస్వలలు పవిత్రురాండ్రుగా నుందురో యాలోచింపుము. అట్లు పవిత్రురాండ్రుగాని కన్యకలు వివాహమునకు ముందే రెండు మూఁడు గర్భాధాన సుఖము లనుభవించి తమకుc బుట్టిన శిశువులను ముండ్ల కంపలలోనో పొదలలోనో మనుష్యసంచారము గల బాటలలోనో పాఱవైవcగా దిక్కు లేని బిడ్డలని వారిని దెచ్చి ప్రభుత్వమువారు పశ్చిమదేశంబుల సాఁకుచున్నారు. అనాథశరణాలయములలోc దల్లిదండ్రుల పేర్లెఱుంగని లంజబిడ్డ లెందఱో యున్నారు. పాశ్చాత్య నాగరికతా మహామారిమన దేశమందును వ్యాపించుచు నిట్టి బిడ్డల రక్షణమునకై యాలయము లేర్పాటు చేయవలసిన యక్కఱ కలుగcగా వీనిని గలిగింప సంఘ సంస్కా రనామధారులు పాటుపడుచున్నారు. శకుంతలాది క్షత్రియస్త్రీలు రజస్వలలైన పిమ్మట వివాహమాడలేదా, శూద్రులయం దిట్టి యాచారములేదా యందు వేమో? అందైనc గలదు గాని యది సార్వత్రికము గాదు. తగిన వరుఁడు దొరకనపుడు కన్యలను వారు పెంతురు గాని తగిన వరుఁడు దొరకినపుడు కాదు. వారియందును జ్ఞానము గలవారు వేఱుగతి లేనప్పుడు సమ్మతించినను విధిగc బాటించుట లేదనియు నట్టి వివాహములవలనc గలుగు నష్టము వారికిc దెలియకపోలేదనియు శకుంతలతోc గణ్వుఁడు చెప్పిన "పొగచేతc గన్నులు మూసికొని వేసినను నాహుతి యిట్టట్టు పడక యగ్నియందే పడెను" అను వాక్యముచే స్పష్టపడుచున్నది. శకుంతల తన్ను వరించినవాని పుట్టువుగుణము విచారింపక వాని మాటలనే నమ్మి వివాహము చేసికొనెను. వాఁడు ద్రోహి గాకుండుటకు దైవము కారణము. అయినను దన తెలివితక్కు వ తనముచేc జేసిన కార్యము ఫల మామెయనుభవించెను గదా. ఇప్పు డెందఱు దుష్టులు మోసపు మాటలచే నీటులచే బాలికలను వంచించి భ్రష్టులను జేయుచున్నారో తెలియదా? కులము చెఱుచువారేగాని కూడు పెట్టువారు లేరను సామెత వ్యర్థముగాదు.

క్షత్రియులు బలపౌరుష పరాక్రమములచే జీవించు వారు అట్టి వారందఱు ప్రసిద్ధులుగానే యుందురు కావున బొరపడుటకు కారణముండదు స్వయంవరాదులందుc జొరపడుటకుc జోటేలేదుకదా. అట్లుండియు లోకమున సదాచారమును బ్రవర్తింపcజేయ నవతరించిన సీతారాముల వివాహమెట్టిదో యాలోచింపుము. తన తండ్రి సమ్మతించి చేసిన వివాహ మను కారణముచేత శ్రీరాములు సీతయందు విశేష ప్రీతి కలిగియుండెనని వాల్మీకిమహర్షి చెప్పెను. తండ్రి సమ్మతింపకముందు శ్రీరాముఁడు సీతను వివాహమాడిన వాఁడును గాఁడు.

శూద్రులయందు వివాహము కాని కన్యకలు సమర్తాడినవెంటనే యిల్లువిడిచి వెలుపల రానీయక వారిని నిర్బంధింతురు. ఈ యాచారమునకుc గారణ మేమో యాలోచింపలేవా? ఒకానొకcడు పూర్వకాలమున రజస్వలా వివాహములు కలవనుటకు

శ్లో ॥ అరోపితా శిలాయా మశ్మేవ త్వం భవేతి మంత్రేణ
మగ్నాపి పరిణయాపది జారముఖం వీక్ష్య హసితైవ.

ఈ శ్లోకమును బ్రమాణముగ నుదహరించెను. రాతివలె స్థిరముగc జలింపకుండుము. ఈ రాతిపై నీ వెక్కు ము అను మంత్రమును జెప్పcగాc బెండ్లి కూతురుపెండ్లి యను మహా విపత్తులో మునిగిcయుండియు జారునిజూచి నవ్వెను. ఇది ఈ శ్లోకమున కర్థము. ఒక రజస్వలకు వివాహ మగుచుండ దానిమిండcడు దానిని జూడ వచ్చి సభలోc గూర్చుండెను. అప్పుడు సన్నెకల్లు త్రొక్కి ంచు సమయంబునc బురోహితుcడు. "ఈరాతిపై నెక్కు ము. రాతివలెc జలింపకుము" అనుమంత్రమును బఠించెను. ఆ మాటలు వినcగానే యా పెండ్లికొమార్తెకుc బూర్వ మొకప్పు డా జారుcడు చెప్పిన యీ మాటలు విని తమ పూర్వ వృత్తము స్మరించుకొని జారుని జూచి నవ్వెను. ఇది జరిగిన వృత్తాంతము, ఈ విషయము వానికిc జెప్పcగానే యామూఢుcడు సిగ్గుపడి తనశ్లోకము తన శోకమునకుc గారణమయ్యెనని తలవంచుకొనెను. ఇట్టి వాక్యములను బ్రమాణములుగc గొని సంఘము సంస్క రింపcబడుచున్నది. ఇది ఇప్పు డప్రస్తుతము నవావశ్యకము గావునc బూర్ణముగc జర్చింపcదలcపలేదు. గాని యిప్పటి మన వివాహపద్ధతులవలన మేలు గలదా లేదా విచారింతము.

కామము కన్నులc దట్టిన పిదప ముట్టుతలు తాముగా వరులను గోరుకొను నెడల రూపమును దేహపుష్టినిబట్టి కోరుకొందురు. తాము కోరువాని యితర గుణములు పుట్టువు పూర్వచరిత్రము పూర్ణముగc

దెలిసికొన వారికి నవకాశముండదు. కన్యావరయతేరూపమని కలదుగదా. దేహపుష్టిని నెఱ్ఱితోలును బట్టియే వివాహములు జరగునేని వానివలని కీడులెన్నియో చెప్పనక్క ఱలేదు. కలిదాసుల కోరిక ప్రకారము రజస్వలా వివాహములు ప్రబలమాయెనా పాశ్చాత్యుల 'కోర్టింగులు, ఊయింగులు' రహస్యపు 'మీటింగులు' అన్ని కూడ రావలయును. అవి వచ్చెనా వాని వెంట వారి యనాథశిశువుల శరణాలయములు రావలయును. ఈ మహాలయముల వెంబడి యీ లంజకొడుకులను లంజకొమార్తలను రక్షించుటకై క్రొత్తపన్నులు రావలయును. వివాహమైన వెంటనే పెండ్లికొడుకుల తల్లులు తండ్రులు పూఁటకూలియిండ్ల పాలుకావలయును. ఆ పద్ధతులు రాకపోయెనా యప్పుడు కలుగు కీడులు చెప్పనక్క రలేదు. తల్లిదండ్రులు తగిన వరులను విచారించి కొమార్తెలు సమర్తాడకముందే చేయు వివాహములవలన నిట్టి కీడులు గలుగఁ గారణము లేదు. తల్లిదండ్రులు లోకానుభవముగల వారుగాను, బంధువులను వారి వారి గుణములను వారి విజ్యాధన సంపత్తులను యోగ్యతా యోగ్యతలను దెలిసినవారుగా నుందురు. కావునఁ దమతో సరిసమానులుగ నుండువారి పిల్లవాండ్రకే తమ పిల్లల నిత్తురు. పొరపాటున కెడములేదు. ఒకవేళ పొరపడినను కన్యకల పొరపాటువలనఁ గలుగు కీడునకంటెఁ దక్కు వ కీడే గలుగును గాని ఎక్కు వ కీడు కలుగదు, దీనికిఁ బాశ్చాత్యదేశముల నుండు వివాహబంధచ్ఛేదకములగు న్యాయస్థానములే నిదర్శనములు.

తల్లిదండ్రులని నేను జెప్పిన చోటనెల్ల నాఁడుపిల్లల క్షేమముగోరి తమ బుద్ధిని లాభశోభ పక్షపాతాదులకు లోపడనీయక బంధుజాలములో శక్తివంచనము లేక వెదకి లభ్యపడువారిలో నుత్తముఁడుగాఁ జూచి వివాహము చేయువారని గ్రహింపుము. వాఁ డెంత విద్యావంతుఁడైనను, మఱెంత త్రాగుట, జూదమాడుట, దొంగతనము చేయుట, వ్యభిచారము చేయుట, అప్పుడు లేకుండినను దానివలనఁ గలుగురోగముల నంతకు ముందైనఁ గలిగియుండుట, దుర్వృత్తుఁడగుట యిట్టి చెడుగుణములు గలవాఁ డాయెనేని వానికిఁ బిల్లల నీయరాదు. ధనవంతుఁడు గాకున్నను, విశేష విద్యావంతుఁడు గాకున్నను గుణవంతుఁ డాయెనేని పిల్ల నియ్య వచ్చును. పిల్లల నమ్మువారును గొనువారును భారము తీర్చుకొనవలయునని యెవనికో యొకని కిచ్చువారును దల్లిదండ్రులని చెప్ప నర్హులు గారు.

దైవమహిమ యేమియోకాని కేవలము క్రొత్తవారైనను మంగళసూత్రము కట్టిన క్షణమునుండి భార్యభర్తలకుఁ బరస్పరము నిర్మలానురాగ మభ్యుదయ మగుచున్నది. తామిరువు రొక్క టి యను భావము గలుగుచున్నది. భార్య నాది యని భర్తయును భర్తనావాఁడని భార్యయును దలఁతురు. తమ్ముఁ గని పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులయందుండు బ్రేమ కంటెను దటాలున నుదయించిన యీ ప్రేమ యెన్నిమడుఁగులో హెచ్చుయి నిర్మలమై నిరుపమానమై యుండును. ఒకరి సుఖదుఃఖములే మఱియొకరి సుఖదుఃఖములు. ఈ భావము వారెదురుగా నున్నప్పుడెకాదు. పరోక్షముగా నుండినయెడల నొకరి నొకరు తలఁచుట యెక్కు వగుచుండును. ఈ యనురాగరజ్జువు వారు దూరముపోవుకొలఁది సన్నగిల్లక సాఁగుచుండును పుట్టి నింటనుండు కన్యక తనపెనిమిటి క్షేమసమాచారము తెలుపునట్టి యుత్తరము వచ్చినపుడెంత సంతోషించునో, చదువ నేర్చియుండినయెడ దానిని దొంగతనముగనైనఁదీసి చదివి యెప్పటిచోట నెట్లుంచునో, చదువలేనప్పు డూరక యిటునటులైనఁ ద్రిప్పి యచ్చటనే యుంచునో నీ వెఱుంగుదువా? అక్షరములు చదువఁ దెలియకున్నను దన మగనియొద్దనుండి వచ్చిన యుత్తరములను బైవిలాసము నక్క రముల పోలికపట్టియే యిది యిట్టి యూరినుండి వచ్చెనని చెప్పఁగలుగునో తెలియునా? మగఁడు పరీక్షలందుఁ గడతేఱినట్టు లుత్తరము వచ్చినను లేక మఱియే మేలైనఁ గలిగినట్టు లుత్తరము వచ్చినను నెట్టులు తానేనుఁగు నెక్కి నంత సంతోషించునో విపరీతవార్త విన్నప్పుడు ముఖము వెలవెలఁబోవ గ్రుక్కు నో యూహింపఁగలవా? మగనిదేహము నెమ్మదిగా లేదన్న వార్త విన్నప్పుడా చిన్నది యెంత పరితపించునో తనకు నెగిరిపోయి పెనిమిటిఁ జూచుటకు దేవుఁడు ఱెక్క లేల యీయలేదని యెంత విషాదపడునో దాని మనస్సుమాత్ర మెగిరివచ్చి యా పెనిమిటిని చుట్టి యెట్టు తిరుగుచుండునో నీవు భావింపఁగలవా?

ఈ విషయము వర్ణింప గొప్ప కవీశ్వరునకు సాధ్యమేమో కాని నాకు సాధ్యము గాదు. బాలదంపతుల మనస్థితి వారికే తెలియవలయును. కన్ను వలచినవానిని మనస్సు వలచి చేసికొనిన వివాహమునకు శకుంతల దృష్టాంతమేని గుణము రూపము వంశము విచారించి తెలిసికొని తల్లిదండ్రుల యను మతిమీఁద వివాహము చేసికొన్నవారికి దమయంతి, సావిత్రిలోనగువా రేల దృష్టాంతము కాఁగూడదు. వీరందఱు క్షత్రియస్త్రీలగుట మఱవకుము. లోపాముద్ర–సుకన్య–యరుంధతి–గార్గి–మైత్రేయి అనసూయ లోనగు కన్యల వివాహము లెట్టివో తెలిసికొనుము. మగనిని దాను కోరుకొనుట తల్లిదండ్రులు నిశ్చయించుట యీ రెంటిలో నేది నిరపాయమో

యాలోచింపుము. కావున నెన్నివిధములఁ జూచినను దల్లిదండ్రులు చక్కఁగ విచారించి చేయు కన్యావివాహములే శ్రేయస్కరములు. అవియే శాస్త్రసమ్మతములు అవియే యన్యకాంక్షలేక ప్రీతిని వర్ధిల్లజేయునవి. రూపమునకు ధనమునకు బలమునకు మెచ్చి చేయుపెండ్లిండ్లయం దనురాగము లవి యుండువఱకే యుండును. తరువాత నుండవు. అవి తగ్గుకొలఁది ప్రీతియు క్షయించును.

ముట్టుతల పెండ్లిండ్లెట్లు నింద్యములో యెనిమిది సంవత్సరములు రాని శిశువుల పెండ్లిం డ్లట్లు నింద్యములు. విష్ణుపురాణము ప్రకారము 20 సంవత్సరములు మీఱిన తరువాతఁగాని పురుషుఁడు వివాహము చేసికొనరాదు. అట్లు చేసికొనునపుడు తన వయస్సులో మూఁడవవంతు వయస్సుగల దానినిగఁ జేసికొనవలయును. అనఁగా 21వ సంవత్సరము ప్రాయమువాఁడు 7 సంవత్సరముల దానిని 24వ సంవత్సరములవాఁడు 8 సంవత్సరముల కన్యను వివాహ మాడవలయును. ఈ కన్య సమర్తాడునప్పటికిఁ బురుషునకు రమారమి 30 సంవత్సరముల వయస్సుగును. వీరిరువురు నారోగ్యవంతులుగా నుండినచో భార్యకు ముట్లుడుగు వఱకు నా దంపతులు సుఖింపఁ గలుగుదురు. వీరికిఁ బుట్టు బిడ్డలును దృఢగాత్రులు నీరోగులునై యుందురు. ఇప్పుడో పదియవయేఁట సమర్తాడుట 14-15 ఏండ్లలోపల మూఁడు గర్భస్రావము లగుట నాలుగవ కాన్పుబిడ్డ చచ్చుటో బ్రతుకుటో యేర్పడుచున్నది. ఒకవేళ బిడ్డలు బ్రదికినను 8 యేండ్లవారు 3 యేండ్లవారి వలెను 30 యేండ్లవారు 12 యేండ్లవారివలె నుందురు. ఇట్టివారి నీయూరఁ కన్నులారఁ జూచుచున్నాముకదా. ఇట్టివారు పుట్టకున్న ఋషీశ్వరుల వాక్యము లెట్లు సత్యములగును? అవియే వంటివా –

సీ. పదునాఱువర్షముల్ పరమాయు వయ్యెడు
  ధరణీశ ! కలియుగాంతమున వినవె
యేడు నెన్మిదియును నేండ్లప్రాయంబునఁ
  బ్రజ లుద్భవింతురు భామినులకు
ద్రవ్యవిహీనులై దాత యొక్కఁడు లేక
  యన్యోన్యతస్కరు లగుదు రెందు
నెఱిఁగెడు వారును నెంతయుఁ గ్రూరులై
  చెదరి పాపంబు చేసెదరు చూవె

తే. యన్నవిక్రయ మొనరింతు రఖిలజనులుఔ
వేదవిక్రయు లగుదురు విప్రవరులు
పణ్యయోనులు నగుదురు పద్మముఖులు
కష్టతరమైన యక్కలికాలమునను.

క. శ్రుతిధర్మంబులు శూద్రులు
ప్రతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణజాతుల్
మతి చెడి తత్సేవకులై
యతినిందితకర్మకారు లయ్యెద రధిపా !

ప్రస్తుతమున కివి చాలును. ఇప్పుడు జరుగునవి యిఁక జరుగబోవునవి 5 వేల సంవత్సరముల నాఁడే వ్యాసాది మహర్షులు వ్రాసియున్నారు. వారి వాక్యముల యథార్థపఱుచు పుణ్యజనులు నింద్యు లగుదురా! కలికీర్తి ప్రతిష్ఠాపకులెంద ఱెక్కువగ బుట్టిన నంత శీఘ్రము కల్క్యవతారము కలుగును. అది సంతోషవిషయమే కదా! అది పోనిమ్ము. కామాతిరేకమునఁ జేయు కార్యముల ఫల మెట్లుండునో తెలుపుటకై యిది వ్రాసితిని. నీవు నట్లు కామదాసుఁడనై ప్రవర్తింపకుందువుగాక ! రజస్వల కాకముందే వివాహమైయుండిన యెడల నట్టి స్త్రీగాని దాని భర్తగాని వ్యభిచరింపఁ గారణము కలుగదు. దుర్బుద్ధులై దుశ్చేష్టలై కామదాసులై కామాచారులై దుష్ట స్నేహమునఁ జెడినఁ జెడవలయునేకాని వివాహము కానివారికిఁ గలుగు కారణము ఆవశ్యకము వీరికిఁ గలుగదు. కన్యాత్వగౌరవము చెడ వీఁడు నాకుఁదగిన వాఁడా వాఁడు నాకుఁ దగినవాఁడా యని చూచినవానినెల్ల వరించు మానసిక వ్యభిచారమునకును కన్యకకుఁ గారణములేదు తొలుత లావుగ నుండువానిని జూచి వాఁడైనఁ దనకుఁ

దగినవాడనుకొని మఱికొంతసేపటి కందముగలవానిని జూచి వానిపై నభిలాషపడి పిదప ధనము గలవానిని జూచి వీని వరింతునని తలంచి మువ్వురవలన మూఁడు విధముల లాభ ముండుటచే ముఫ్వురవలచుటకై నిశ్చయించి యింతలో మఱియొక మాయలమారి వలలోఁ జిక్కి యతనిఁ బెండ్లాడుట వ్యభిచరించుట గాదా? సావిత్రి వాక్యముల స్మరింపుము. తల్లిదండ్రులు చేయు కన్యకా వివాహములం దిట్టి పాపమునకు నాస్పదములేదు. అట్టివారు చెడుటకుఁ గారణములు వేఱు.

## వివాహ ప్రయోజనము

వివాహములేని పురుషుఁడు విరక్తుఁడుగాఁడేని తానొంటరి గాఁడననియుఁ దనయందే భారము లేదనియు నేనొక్క ఁడ నింత సంపాదించుకొని తినలేకపోదునా యనియుఁ దలంచుచుండును. ఇట్టి భావముగల పురుషుఁడు దారస్వభావము గలవాఁడుగాక యాత్మకార్యైకప్రయోజకుఁడై యుండును. తానెంత సంపాదించుకొని తినువాఁడైనను నెంత సమర్థుఁడైనను నింటఁ బాకాది కృత్యములకు బదుగురుండినను నే నసహాయుఁ డను, నొంటరివాఁడను, సుఖదుఃఖముల కాదుకొనువారు లేనివాడఁను దిక్కు లేనివాఁడను అను నభిప్రాయము వానిని వదలక యుండును. వాఁడు గృహములోని భోగ్యపదార్థములను జూచి యివన్నియు నేమి చేయుదును? ఎవరికిఁ బెట్టి పోవలయును? అని కొఱఁతపడుచునే యుండును. వానికి నింటియందు నభిమానము లేక పూఁటకూటి యింటికంటెను దానిని గొంచెము మేలైనదిగఁ దలఁచుచుండును. వానికిఁ బందుగులందును వినోద క్రీడలందును సంతోషకార్యములదును బరిపూర్ణోత్సాహము లేక దానిని మఱియొకరి బలవంతముననో విధిలేకయో యనువించును. ఇది వైరాగ్యముచేతఁ గాదు. ఉత్సాహము లేమిచేత. కావున నవివాహితుఁడు సుఖుఁడని చెప్పుటకు వలనుపడదు.

వివాహమైనవెంటనే వానికొక యుత్సాహము నుల్లాసము కలిగి తన జన్మమే మాఱినదిగను గ్రొత్తజన్మ మెత్తి నట్టును దలంచును. తానంతకుముం దెంత సుఖిగా సంతోషిగా నుండినను అంతకంటె నెక్కు వ సుఖము సంతోషము లిఁకఁ గలుగునను భావముగలవాఁడగును. హృదయమునకు భారమై పీడించుచుండినట్టి తా నసహాయుఁడు దిక్కు లేని వాఁడు అనునభిప్రాయమును బాఱఁదోలి సర్వసహాయసంపత్తి గలవాని వలె రంజిల్లును. అది మొదలు వాని మనస్సు ఆత్మైక ప్రయోజనమందుఁ బోదు ఏ మంచి పదార్థమును జూచినను దొలుత భార్యకు బిడ్డలకు నియ్య బుద్ధి పుట్టుచుండును. వారనుభవించినఁ గాని యతనికి సంతుష్టిలేదు. పూర్వమువలెఁ దా నొంటరిగ ననుభవింపవలయుననినఁ గష్టము దోఁచును. కావున వివాహము ప్రేమను బెంచును. ప్రేమ మనస్సున కౌదార్యము కలిగించును. ఉదారబుద్ధిచే దయాదిగుణములు కలుగును.

వివాహములేని కారణముచే నే నొంటరిగాఁడను నేను దేహమును జెఱుచుకొనిన నేమి యెట్లుండిన నేమి నావలన మఱియెవరికి బాధలేదుగదా యని తలఁచువాఁడు వివాహము కాఁగనే తన గుణమును భావమును మార్చుకొని నా దేహమును జెఱుచుకొంటినా నా భార్యదేహము బిడ్డలదేహము చెడును. నా వంశమునా రందఱిట్టివారే యగుదురు. కావున నేను బుద్ధిమంతుఁడనై దేహరక్షణము గావించుకొనవలయునని యదిమొద లెంతో జాగ్రత్త గలిగి ప్రవర్తించును. వివాహము లేని యింద్రియలోలుఁడు దుర్విరక్తుఁడై వ్యభిచారాది పాపములు తప్పక చేయును. వివాహానంతరము జారత్వము చోరత్వము మాని చక్క ఁబడిన బుద్ధిమంతు లనేకులున్నారు. రూపయౌవన గుణసంపన్న లయిన భార్యలుండియు వ్యభిచరించు చండాలు రనేకులున్నారు. వారు బుద్ధిలేనివారు గనుక పశు వులతో సమానులు. వారిని మనము మనుష్యులుగా నెంచఁ బనిలేదు. ఇట్టివారిపట్ల నా యభిప్రాయ మిదె. ఈ పుస్తకము మనుష్యులకుద్దేశించి వ్రాసితినిగాని రెండు కాళ్ళ పసరములకుఁ గాదు వివాహితుఁడు దుర్వ్యయము చాలించి మితవ్యయము చేయ నారంభించును. కొందఱు లోభు లగుటయుఁ గలదు. ఈ విధముగ వివాహము మనుష్యులను జక్క ఁబఱుచును. అంతేకాదు. జ్ఞానముగలవారు వివాహమును దైవికము దివ్యము ఉభయలోక శ్రేయస్క రము పవిత్రము ఆత్మోద్ధారకము జన్మతారకమునగు సత్క ర్మముగ గారవింతురు.

సంతాన కాంక్ష భగవత్క ల్పితమనియుఁ బవిత్రమనియు సర్వప్రాణిసామాన్యమనియు నిదివఱకే చెప్పితినిగదా. అట్టి సంతానము భార్యలేక కలుగదు. భార్యాభర్తృసంబంధము మాతాపితృపుత్రాదిక సంబంధము వంటిది గాదు. జన్మజన్మమునకుఁ దల్లిదండ్రులు బిడ్డలు మాఱుచుందురు. భార్యాభర్తలు మాఱరు ఎన్ని జన్మములైనను వారే భార్యాభర్తలుగా నుందురు. ఈ సంబంధము తెగిపోవుటకు వైరాగ్యాది కొన్ని కారణములు గలవు గాని వాని నిట వివరింపఁ బనిలేదు. ఈ రహస్యము తెలిసిన దంపతులు భేదబుద్ధులుమాని పరస్పర మెంతో ప్రీతిగలిగి ప్రవర్తింతురు. దారపుత్రాదులు లేనివారి కీ లోకసుఖములు మిథ్యలు. పరలోక సుఖములు నంతే. సుతులు

లేనివారికి గతులలేవు. తానే తన భార్యయందుఁ బుత్రుఁడుగాఁ బుట్టి తానుదరించు మార్గముల నాచరించు కొనును. భార్యయే లేకుండినఁ బుత్రుఁ డెక్క డ? శ్రాద్ధాదిక్రియ లెక్క డ? పరలోక సుఖ మెక్క డ?

ఈ కారణముచేఁ బశుకల్పులగు కామాంధులు తప్పఁ దక్కి నవారు వివాహము దారసంగమంబును యజ్ఞతుల్యమైన పరమపవిత్రకర్మముగ నెంచి దాని కుచితమైన భంగి నిర్మలమనస్కు లు పరిశుద్ధచరిత్రులునై చరింతురు. సుఖసంసారమే భూలోకస్వర్గము. నీకు సంతోషాధారకము నుభయలోకతారకము పావనకరమునైన సంసారము నేమె తోడ్పాటు లేక నీవు చేయఁజాలవో యట్టి నీ భార్యయందు నీ వెట్టి యభిప్రాయముగలవాఁడవై యుండవలయునో యామె విషయమందెట్లు ప్రవర్తింపవలయునో యిప్పు డాలోచింపుము. ఏమె యొకనాఁడింట లేకున్న నిల్లు పాడుగఁదోఁచునో యట్టి గృహలక్ష్మికడ నీవెట్లు నడచుకొనవలయునో యాలోచింపుము. అంతేకాదు. పురుషునకు దైవికమైన చుట్ట మెవ్వరని యక్షుఁ డడుగఁగా ధర్మరాజు "భార్య దైవికమైనచుట్ట" మని చెప్పెను. శ్రీమద్రామాయణమున వసిష్ఠుఁడు భార్యయే భర్తకు నాత్మయని చెప్పెను. వేదములును చెప్పుచున్నవి. ఆలివంకవారాత్మ బంధువులని సామెతయుఁ గలదు. కావున నాత్మ శ్రేయస్సు గోరువాఁడాత్మయం దెట్లు ప్రవర్తింపవలయునో యూహింపుము. ఇంతేకాదు. పాణిగ్రహణ కాలమున ధర్మమందును అర్థమందును, కామమందును, నిన్ను నతిక్రమించి పోనని యగ్ని సాక్షికముగఁ జేతిలోఁ జేయివైచి ప్రమాణము చేసితివి. అట్టి భార్యయందు నీ వెట్లు ప్రవర్తింపవలయునో యాలోచింపుము. అంతేకాదు. వివాహానంతరము నీ యెడమ వైపు నీభార్యసొత్తు కావుననే భర్తలో సగముభార్యయని వేదములు చెప్పును. శివుఁ డర్ధనారీశ్వరుఁ డనఁగా నేమి యర్థము? తన దేహము సగము భార్యకుఁబంచి యిచ్చెననియేకదా? విష్ణువునకు లక్ష్మీదేవి హృదయమందున్న దన నేమి? ఆయన హృదయమే యామెయనియు నామె కసంతుష్టిగ నాయన హృదయము పోదనియు నే కార్యమందును నిద్దఱ హృదయము లైక మత్యంబునఁ బ్రవర్తించు ననియునేకదా? బ్రహ్మకు సరస్వతి వాక్కు న నున్న దన నేమి? ఉభయ లేకవాక్యము కలవారనియేకదా. త్రిమూర్తులదాంపత్యము భార్యాభర్తృసంబంధము వెన్నెలచంద్రుని సంబంధమువలె నవినాభావ సంబంధమని తెలుపును. ఇట్టి భార్యయందు నీ వెట్టివర్తనము కలవాఁ డవై యుండుట నీకు శ్రేయస్క రమో యాలోచింపుము.

నాయనా ! భార్యాభర్త ృత్వతత్త్వమిట్లుండును గావున భార్య దుశ్చరిత్రయైనఁ దప్ప దానియందు భర్త ప్రీతివదలి యేకారణముచేనైన సరియ స్వేచ్ఛగా వర్తించుట యాత్మహత్య గావించుకొనుటే యని నమ్ముము.

పురుషు లిట్లు తమతో నేకీభావముఁ బ్రవర్తింతురను విశ్వాసముచేఁ గదా స్త్రీలు వారిని వివాహ మాడుదురు. అట్లు గాదేని వారేల తమ స్వాతంత్ర్యమును గోలుపోయి తమ యర్థము మానము దేహము ప్రాణము పురుషుల చేతిలోఁ బెట్టి వారికి దాసురాండ్రై వారిక్షేమమే తమ క్షేమముగా నెంచుచు దమ సుఖములైన వదలి వారికి నుపచరించుచు, గృహకృత్యములందు వారికంటెఁ దామెక్కు వ పాటుపడుచు, వారికి దుర్భరమైన గర్భధారణాది భారములు తాము వహించుచు. వారి వంశము నభివృద్ధి చేయుచు వారినే దైవముగ దిక్కు గ నమ్ముచు, వారు ముందు మరణించినఁ దామును సర్వసుఖములు వదలి సన్న్యాసినీవ్రతము స్వీకరించుచుఁ, దాము ముందు మరణించిరా స్వర్గమునఁ బతుల రాకకై యెదురుచూచుచు నుందురు. కావున నట్టి వారికి ద్రోహము చేయువారి నేమనవలయును? భర్తలు భార్యలపట్ల సర్వదా స్నేహభావము గలిగియే ప్రవర్తింపవలయును. వేఱుభావము కూడదు.

## స్త్రీ పురుష స్వభావ తారతమ్యము

స్త్రీలు స్వభావముచే దుష్టలని నికృష్టలని కొందఱ యభిప్రాయము. స్త్రీ జాతియే యిట్టిదని చెప్పుట తగదని సీతాదేవి శ్రీరామునితోఁ జెప్పెను. సాధువులగునవి పశుపక్ష్యాదులందును గలవన మనుష్యస్త్రీలయందు సాధ్వులు లేరనుట యేటిమాట? పురుషులందు దుష్టులు లేరా? గుణమునుబట్టి మంచిచెడ్డ లేర్పడునుగాని కేవల జాతినిబట్టి కాదు. గుణము మనస్సునుబట్టి యుండును. ఆహారాదులఁబట్టి దేహతత్త్వము మాఱును. అది యటుండ నిచ్చి సహజముగ స్త్రీ పురుష భేదమెట్టిదో చూతము. పురుషులు సాధారణముగఁ బొడువువారు. స్త్రీలు పొట్టివారు. అవయవపూర్తి సమముగానున్న పురుషునకు మూఁపులు విశాలములు. పిఱుఁదులు సన్నములు. స్త్రీలకు మూఁపులు సన్నములు పిఱుఁదులు విశాలములు. స్త్రీలకు మూఁపులు కొంచెము వెనుకకుఁబోయి యుండును. కనుక వక్షస్థలము లోతుఁగానుండును. ఈ నిమిత్తముననే మెడకొంకి యెముక పొట్టిగా వక్రముగ నుండును కావున స్త్రీలు రాలను దూరముగ గుఱిగ ఱువ్వలేరు. పురుషులందుఁ గండరములు వృద్ధియై స్పష్టముగ మిట్టపల్లముగఁ దెలియును.

కండరములు బాగుగఁ బెరిఁగిన స్త్రీలయందును నవి క్రొవ్వుచేఁ గప్పఁబడుటచేఁ మిట్టలు పల్లములు తెలియరాకుండు నట్లు గుండ్రములుగ నుండును. ఇదియే వారికొక యందమును గలిగించుచున్నది. పురుషుని కండరములకు బలము మెండు. స్త్రీలకు సహజశక్తి మెండు. పశువులందును పరువెత్తునవి భారము మోయజాలవు. భారము మోయునవి పరివెత్తఁజాలవు. స్త్రీలకు దలలు చిన్నవి ఱొమ్మెముకలు పొట్టివి. పురుషధ్వని గంభీరము పరుషము స్త్రీలధ్వని మృదువు శ్రవ్యము. వారికిఁ గంఠము పొడవు. చర్మము నునువు మెత్తన. తలవెండ్రుకలు దండి. ఈ పరస్పర భేదములు వారువారు చేయు కార్యముల కనుకూలముగ నున్నవని యాలోచించినఁ దెలిసికొనఁగలవు.

ఇంతకు ముఖ్యమైనభేదము పొత్తికడుపునఁ గలదు. వెన్నెముక వెంటఁ గ్రిందివైపుగ రెండువ్రేళ్ళు పోనిచ్చితివేని మలద్వారమునకు కొంచెము మీఁదుగ నది ముగిసిపోవుటయు ఆ యెముకకొన గుండ్రముగ నుండుటయుఁ దెలిసికొనఁ గలవు. ఇది వెనుకభాగమం దుండును. ఆ భాగము వెన్నెముకకు రెండు వైపులను రెండు తుంటియెముక లుండును. నడుమునకు రెండుప్రక్క ల రెండుచేతుల నొత్తిన నవి తెలియ వచ్చును. ముందుభాగమున రెండెముకలు గలవు. దీనికంతయు కూపకము లేక వస్తికమని పేరు. ఇది మూఁతలేని పెట్టెను బోర్లించినట్లుండునుగాని పెట్టె ప్రక్క పలకవలె నఖండముగ నుండక నడుమ నడుమ తెఱపలుండును. ఇది యంతయుఁ దొడల యెముకలమీఁది వంతెనవలె నుండును. ప్రాణాధారములైన యవయవములన్నియు మూత్రకోశము మొదలైనవి యీ కూపకమందున్నవి.

పురుషునియం దీ కూపకము చలనకార్యమునకు దేహదార్ఢ్యకార్యమునకు మాత్రమే యుపయోగించును. స్త్రీల యందు దీనికి విశేషప్రయోజనము కలదు. మీఁదఁ జెప్పిన ప్రక్క యెముకలే కూపకమున నెత్తుప్రదేశములై యచ్చటినుండి నేటవ్రాలుగ క్రిందివైపునకు పోవుటచే మీఁది భాగమునకంటె నడుగునమూతి. సన్నమయ్యెను. ఇట్టి యేర్పాటుచే స్త్రీలగర్భ కుహరమున పిండము నిలుచుట క్రమక్రమముగ నభివృద్ధిచెంది వెలికి వచ్చుట సుకరమయ్యెను. ఈ విధముగ భగవంతుఁడు స్త్రీలకు మాతృత్వభారము సహించుటకును ఆ కార్యము నిరపాయముగ నెఱవేర్చుటకును గావలసిన యవయవసౌకర్యము గలిగించెను. దీర్ఘములు బలిష్ఠములు పరుషములు నైన కండరములను భీకరదృష్టులను బురుషుల కిచ్చి హ్రస్వములు దుర్బలములు కోమలములునైన కండరములను సౌమ్యదృష్టులను స్త్రీల కిచ్చుటకుఁ గారణము పురుషులు భర్తలు పతులుగా నుండవలయుననియు స్త్రీలు భర్తవ్యలు పాలితలుగా నుండవలయుననియు భగవదుద్దేశమని తోచెడివి.

వారివారి కార్యములకు యోగ్యమైన యవయవసౌష్ఠవ మిచ్చినట్టు భగవంతుఁడు వారివారికిఁ దగిన బుద్ధులు నిచ్చియున్నాఁడు. పురుషులు కారణపరంపర నెంత దూరమైన నాలోచింపఁగలరు. కాని స్త్రీ లట్టు లాలోచింపలేరు. ఈకారణములచే నీ కార్య మిట్లగునని పురుషులు చెప్పినట్టు స్త్రీలు చెప్పరుగాని యిది యిట్లనిమాత్రము తటాలున చెప్పుదురు. అదెట్లనిన స్త్రీలు కారణముచెప్పలేరుగాని యవును అదియట్లే మాకుఁ దెలియునందురు. సమీపకార్యములపట్ల మగవారి యూహలకంటె వారియూహలు సరిపోవునుగాని దవ్వువిషయంబుల వారియూహలు సరిదాఁకుట యరుదు. కావుననే దీర్ఘాలోచనము చేయవలసిన విషయములను స్త్రీలతో నాలోచింపరాదు.

స్త్రీల నరములు మిగుల కోమలములై నాజెములైనవి. కావున వారు శోకసంతోషములకు శీఘ్రముగఁ బాలుపడుదురు. పురుషులకు సంతోషకరములైనవి వారికంత సంతోషకరములుగావు. ఇల్లువాకిలి దిద్దుకొనుట యందును నలంకరించుట యందును బిడ్డల రక్షణమందును సంగీతాది కళలయందును వారి కాసక్తి మెండు. దీని కపవాదములునుగలవు. కాని యిది సామాన్యవిధి. ఇట్లు కోమలులయ్యు స్త్రీలు సహనగుణముచేఁ బురుషుల కూహింపను గూడ సాధ్యపడని ప్రసవవేదనాది కష్టములను సహింపఁ గలరు. వెలుపలికిఁ దెలియ వచ్చు నీ భేదములకు మూలకందమైన దానిని చెప్పెదను. విత్తనము లక్షణము దెలిసినఁ జెట్టు లక్షణము తెలియును. విత్తనమున లేని గుణములు చెట్టునం దుండఁజాలవు. స్థూల సూక్ష్మదశల భేదమేకాని యితర భేదముండదు. అట్లే స్త్రీపురుషుల బాహ్యలక్షణములకుఁ గారణము వారి జన్మకారణమైన యండములవలనఁ దెలియనగు. వృక్షములు మృగములు బీజములవలనఁ గాని యండములవలనఁ గాని కలుగుచున్నవి. వేనివలనఁ గాని యండములవలనఁ గాని కలుగుచున్నవి. వేనివలనఁ జెట్లు పుట్టునో యవి బీజములనియు వేనివలన పక్షులు పుట్టునో యని యండము లనియు వాడుకయందుఁ గలదు గాని యండములు బీజములు సమానార్థకములే. చెట్ల యం దీ బీజములు (అండములు) వానిలోపల నుండక వెలుపల నుత్పత్తియగును.

పక్షిజాతులందు నండములు (గ్రుడ్లు) కడుపులోపలనే వృద్ధియయి వెలుపలవచ్చి పిమ్మట పిల్లలగును. పాలిచ్చు జంతువులందు వెలుపలవచ్చి పిమ్మట పిల్లలగును. పాలిచ్చు జంతువులందు నండము కడుపులోనే పిల్లయయి వెలుపల వచ్చును. స్త్రీ లీ తెగలోఁ జేరినవారే. స్త్రీలయం దీ యండము కడుపులో నొక భాగమైన యండకములోఁ బుట్టి పెరిఁగి భగవంతుఁడు విధించిన మార్గము చొప్పున గర్భకోశములోఁ బెరిఁగి పిల్లయయి వెలుపల వచ్చును. భేద మింతేకాని యన్నిటికిఁ గారణ మండమే. అన్నిజాతులం దీ గ్రుడ్లు స్త్రీలయందే యుత్పత్తి యగును. ఈ గ్రుడ్లు స్త్రీల యండకములలో 28 దినములవఱకుఁ బుట్టుచు నెదుగుకొఁదిని నా యండకములలో నుండి గర్భకోశములోనికి వచ్చు నాళముల మార్గమున జీవాణువుల రాక కెదురుచూచుచుఁ బోయి గర్భశోకములోఁ బ్రవేశించును. గ్రుడ్లు తమంత స్వతంత్రించి యీ ప్రయాణము చేయఁజాలవు. మనము మ్రింగిన యాహారము కంఠనాళమునఁ గణముల చలనముచే నెట్లు జరగిపోవునో యట్లులే యండకముల నాళములలోని కణముల చలనముచే నీ యండము ముందు ముందు త్రోసికొని పోఁ బడుచుండును. దీనివలన నివి చుఱుకుగ స్వతంత్రించి చలించునవి గాక పరాధీనములైన వని తెలియవచ్చును. ఈ యండములు 240 యొకదాని ప్రక్క నొకటి యుంచిన నొక యంగుళమంత పొడు వగును. ఇవి యిట్లు ప్రయాణము చేయుచుండఁ బురుషుని యండములలో నుండి రేతోనాళమార్గమున రేతస్సు స్త్రీ గర్భకోశములోఁ బ్రవేశించును. రేతస్సునందు జీవాణువులుండుట కుమార హితచర్య యందుఁ జెప్పితినిగదా. ఈ జీవాణువులు స్త్రీల యండములవలె స్వతంత్ర చలనము లేనివి గావు. సర్వదా నిలుకడలేక యొకచోటనుండక సంచారము చేయుచునే యుండును. ఇవి స్త్రీగర్భకోశములోఁ బ్రవేశింపఁ గనే విచ్చలవిడి బయలు దేరి నీటిలోఁ దిరుగు చేఁపలవలెఁ దిరుగుచుఁ దమకు యోగ్యమైన యండములను వెదకికొని పోవును గాని యెదుటఁ బడిన నల్లకుక్క నైన వదలని దుష్టజారులవలె నే యండ మెదురుగ నుండిన దానిలోఁ బ్రవేశింపవు గర్భకోశమునఁ దమకుఁ దగిన యండము దొరకదేని యండములు వచ్చిన నాళములలోఁ జొరఁబడి యండకముల లోనికిఁ బోవుటయుఁ గలదు. పురుషుల యందు రేతఃకోశములైన ముష్క ము లెటువంటివో స్త్రీల యం దట్టివానికే యండకములని పేరు. పురుషుని ముష్క ములనే యండములని బీజములని చెప్పుదురు. అండము వాఁచినది, ఒరబీజము అన్నప్పుడీ పదములు సాధారణముగా వాడఁబడుచున్నవి గదా. పురుషుని యండములకు స్త్రీల యండములకు నేమియు భేదము లేదు. స్త్రీలయందు లోపలనుండును. పురుషులయందు వెలికిఁ గానవచ్చు చుండును. స్త్రీలకును రెండండకములు గలవు. ఇవి గర్భకోశమున కిరుప్రక్క ల నుండును. పుస్తకము కడపట నుండు పటము చూడుఁడు.

స్వతంత్ర గమనముచేఁ దనకుఁ దగిన యండమును వెదకికొని పోవుటచేతనే పురుషునిలోని జీవాణు వెంత చుఱుకు తనము చొరవగలదో తెలియనగును. జీవాణువునకుఁ దగిన యండము దొరకుట దైవకృపయేగాని యితర ప్రయత్నము వలన సాధ్యమగునదిగఁ దోఁపలేదు. తనకుఁదగిన యండమును సంపాదించు కొనిన జీవాణు వాఁడుపక్షియొద్ద వగలుగలుకు మగపక్షివలె నిటునటు చలించుచు దానిచుట్టు కొన్నిమార్లు తిరిగి పిదప దానిలోఁ ప్రవేశించును. ఇదియే గర్భధారణము. అంతతో ముట్టు నిలుచును. ఒక యండమునందు రెండు జీవాణువులు ప్రవేశించిన నమడబిడ్డ లుదయింతురు. ఇట్టు లండము జీవాణువు కలయికవలన నైనదే జీవి. దీనికి దేహము తల్లి యిచ్చినది. జీవము తండ్రి యిచ్చినది. ఇట్లు కలయుటచే నా రెంటికంటె వేఱయినను నందేదేది యెవరియం దుత్పన్నము లయ్యెనో వారివారి గుణములు కొన్నికలవైయుండును.

పురుషుని తీవ్రతకు స్త్రీ సౌమ్యగుణమునకుఁ గారణమిప్పుడు తెలిసెనుగదా. ఈ రెండుగుణములు నూతన శిశువులందును గననగు. అప్పుడు పుట్టిన మగబిడ్డనాడి యాఁడుబిడ్డనాడికంటె రెండు మూఁడుమా ర్లెక్కు వగఁ గొట్టుకొనునని వైద్యులు చెప్పెదరు. ఇట్టి భేదము లింకను కొన్ని కలవు. ఇంత యేల? సూక్ష్మతరములైన నరములందును స్త్రీపురుష భేదము కానవచ్చుచున్నది. శైశవమందువలె బాల్యకౌమారములందును గూడ బాలురకుఁ గ్రీడాది వ్యాయామములందున్న చుఱుకుతనము చొరవ యంగవిక్షేపము బాలికల కుండదు. ఇట్టి స్వభావగుణము పెద్దవారై నపుడు మాత్రమెందుఁబోఁగలదు? లోకమున మగ స్త్రీలును ఆఁడుపురుషులు (ఆఁడంగులు) నెందేని కలరు. దీనికిఁ గారణమును గలదు గాని యిప్పు డా శాస్త్రమును విచారింపఁ బనిలేదు. నోటి గయ్యాళి తనము చేతి గయ్యాళితనము మాత్రమే కాక కామాతి శయముచేఁ బురుషులనిన నెగబడి పై పడిపోయి పురుషులవలెఁ జరించు మగ స్త్రీని విడిచిన దక్కి న యే స్త్రీయును బురుషుని రతికై తానై ప్రార్థించుట యరుదు. ఈ విషయమున స్త్రీలు సాధారణముగ నుదాసీనలు. కొన్ని సందర్భముల విముఖులు నయ్యును భర్తల ప్రార్థన తోసివేయఁ జాలకయు వారు కోపింతురో యనుభయముచేతను వారు చెప్పినట్లు వినుచుందురు. ఇట్టి సమయమున ననఁగా స్త్రీకి

కామము లేక మనస్సునకు విరోధముగా పతితోఁ గలసిన సమయమున గర్భము నిలిచెనేని యప్పుడు పుట్టెడి బిడ్డ యేడుపుగొట్టుగాను తాను సుఖపడక యెదుటివారిని సుఖపెట్టక అంపుచేయునదిగా నుండును. రతివిషయమునం దగరుగొండులు పురుషులే. ఎంతటి సిగ్గువిడిచిన లంజయును దన యొద్దకు రమ్మని పురుషునింటికిఁ బోయి ప్రార్థింపదు. పురుషులే వారియిండ్లకుఁ బోయి ముడుపులు సమర్పించి ముడ్డినాకి మూతినాకి వచ్చుచుందురు. ఇది రసికలక్షణమంట. ఇట్లు తామై వారిని లంచములచేతను మాయోపాయములచేతను దుర్వృత్తికి లోపఱుచుచు వారి యిల్లు దాఁటి వెలికివచ్చి కొందఱు రచ్చకెక్కి యేకపత్నీవ్రతులవలె వేశ్యలఁ దిట్టుచుందురు. దీనివలనఁ బురుషుని ధూర్తత స్పష్టముకాలేదా? పురుషు లావంకఁ బోకున్న వేశ్య లేమిచేయఁగలరు? మగనికొట్టి మొఱపెట్టె ననుసామెత యిట్టిదేకదా. ఈ ధూర్తత లంజగాండ్రయందే కాదు ఇంటి యందుఁ బండితులకు జీతము లిచ్చి విద్య నేర్చుకొనుచు రచ్చలందుఁ బండితులు మూఢులు తెలివిలేనివారని తిట్టు నింగ్లీషు నేర్చిన యతిభారపు మానుసులందును గానవచ్చుచున్నది.

స్త్రీలకుఁ గామము లేదని నా యభిప్రాయము గాదు. పురుషునికంటె నెక్కు వగ నున్నను వారు నైజసహనశక్తిచే దాని నణఁచి యుంచఁగలరు. పురుషులీవిషయమున నబలులు. భార్యల యుదాసీనభావ మిరువురకు క్షేమకరము. పురుషులకున్నంత కామోద్రేకము స్త్రీలకు నుండిన నిరువుర యారోగ్యము శీఘ్రకాలములోనే చెడి కలకాలము దుఃఖపుబ్రదుకు బ్రదుకుటే గాక వారి బిడ్డలను దుఃఖభాగులఁ జేయుదురు. అప్పుడు ప్రపంచమునకే నిర్భాగ్యదశపట్టును. కావున స్త్రీల సౌమ్యగుణము పురుషుని క్షేమమునకు సుఖసంతానాభ్యుదయమునకుఁ గారణమైనది. ప్రజోత్పత్తికిఁ గావలసిన సదుపాయములను భగవంతుఁడు కల్పించెను. వాని నతిక్రమించు దుర్బుద్ధులు తగిన శిక్ష యనుభవింతురు. మీఁది కారణముల వలననే కదా వ్యభిచార విషయమున దోషులు పురుషులే యని భారతమునఁ జెప్పఁబడినది. కర్తయుఁ గారయితయుఁ బ్రేరకుఁడు అనుమోదకుఁడు పురుషుఁ డగుటచేతనే కదా స్త్రీలపాపము వారి పురుషులనే పొందునని శాస్త్రములు చెప్పుచున్నవి. విధవావివాహ రజస్వలావివాహక ర్తలకుఁ గారయితలకుఁ – బ్రేరకులకు – అనుమోదకులకు భగవంతుఁడు మంచి బుద్ధి యిచ్చి రక్షించును గాక.

7–8 సంవత్సరములవఱకు బాలికలు బాలకులు నించుమించుగ నేకవిధమైన దేహమనస్తత్త్వములు గల వారుగ నుందురు. అది మొద లిరువురయందు వారు వారు ముందు చేయఁబోవు కార్యముల కనుకూలముగ నుండునట్లు మాఱుట కారంభించును. స్త్రీలయందలి కూపకము గర్భధారణమునకు ననుకూలపడునట్లు మాఱును. ఇట్లు జరిగిన మాఱుపాటులను గడపటఁ జూడఁగా స్త్రీ పురుషులం దవయవభేద గానరాదు. మనుష్యులందును మృగములందును స్త్రీ లక్షణము లేవేవియని చెప్పెదమో యట్టివి పురుషులందును, పురుషలక్షణము లనునవి స్త్రీలయందును కొంచెముగఁ గానవచ్చుచున్నవి. విస్తర మేలకాని స్త్రీలకువలెఁ బురుషులకును స్తనములు కలవుకదా. కొన్ని జాతులందు వీరు వీనిని కొంతకాల మొకవిధముగనలుపుచు వాడుకచేసి బిడ్డలకు దాదులై పాలిచ్చువారు నగుచున్నారని శోధకులు వ్రాసియున్నారు. ఇంకను మఱికొన్నిటిని పరిశోధింపఁగాఁ బురుషులయందుఁ బ్రారంభ దశయందుండు కొన్ని దేహభాగములు స్త్రీలయందుఁ బరిణామదశ వహించెనని తెలియవచ్చును. స్త్రీ పురుషుల సంతానోత్పత్తికి సాధనములైన యంగము లేకవిధమైనవిగాఁ దోఁచును. పురుషుని కూసకముఖమునందలి వంపు భాగమును కొంచెము విశాలపఱిచి పురుషుని పురుషాంగమును అండములతోడ నున్న దున్నట్టు కడుపులోనికిఁ ద్రోచిన స్త్రీల గర్భకోశమునకు గర్భద్వారమునకు సరిపోవును. అట్టులే పురుషుని యండములు వాని కిరుప్రక్క ల నుండునట్లు రేతోవాహిని నరములతోడఁ ద్రోచిన స్త్రీల యండకములకు నండకములనుండి గర్భకోశములోనికి వచ్చు నాళములకు సరిపోవును. మఱి యే మార్పును లేక పురుషాంగమును గుఱుచపఱిచినచో స్త్రీల త్రికోణోర్ధ్వ భాగమందలి ముక్కు నకు (దీనినే యాంగ్లభాష యందు Clitoris క్లైటోరిస్ యందురు) సరిపోవును. నరములనేకములు కూడునట్టి స్థల మీ ప్రదేశమే. విశేషముగ స్పర్శసుఖము తెలియు ప్రదేశ మియ్యదియే. నరములన్నియు నిందుఁగూడును గావుననే యీ భాగమునఁ దగులు శీతోష్ణములు దేహమునకంతయు వ్యాపించును. కావుననే నీటివైద్య మందుఁ గూడ నీ భాగములను చలినీటితోఁ దడుపుచుండు మని చెప్పఁబడినది. దానివలన దేహమందలి యుష్ణము తగ్గును నరములును నుద్రేకము తగ్గి సమరసభావము వహించును. పాదముల కాముదము రాచుకొనిన కన్నులు చల్లబడుటయు అరచేతులు నిప్పుసెగను గాఁచుకొనిన దేహ మందంతయు వేఁడి యెక్కు టయు నీ కారణము చేతనే, కావుననే పలుమారు చలినీట కాలుసేతులు కడుగుకొనుమని పుక్కిలించివేయుమని శాస్త్రములు చెప్పుచున్నవి. మీఁదఁచెప్పిన యంగాకారము సాక్షాత్తుగ అక్రూట్ అని చెప్పఁబడు కాయలను సగమునకు సరిగ

చీల్చినఁ గానవగును. ఒకటిగా కలిసిన రెండు పప్పులను ఆ రెంటికి నడిమిపొరను చూచిన మీఁద వ్రాయఁబడిన విషయము స్పష్టము గాఁగలదు. విషయము తెలియక యాలోచింపకున్నప్పు డెంతో భేద మున్నట్టు కనఁబడునది తత్త్వమెఱిగినపిమ్మట సమానముగనే కనఁబడును. స్త్రీలమర్మాంగములు గర్భములో దాఁగియుండుటయుఁ బురుషుని యంగములు బాహిరములై వెలుపలికి నిట్టపొడుచుకొని వచ్చియుండుటయు నాలోచింప స్త్రీల సౌమ్యగుణము గాంభీర్యము లజ్జాతిశయము పురుషుని ధూర్తత్వము అగరుగొండితనము తెలియవచ్చును. వివేకముగలిగి యీ విషయము నాలోచించువారికి భగవచ్చిత్రమహిమము, ఆయన యత్యద్భుతమైన యేర్పాటు గానవచ్చును. దానివలన నెంతోజ్ఞానము కుదిరి భేదబుద్ధిమాని స్నేహము తుల్యభావము ప్రబలి కుటుంబసఖ్య మవిచ్ఛిన్నముగ సాగును. నేను మీఁదఁజెప్పిన విషయములన్ని యాలోచించి స్త్రీపురుషులం దెవరుతక్కు వో యెవరెక్కు వో నీవే నిర్ధారించు కొనుము. మఱియు వినుము. పరకీయ చిత్తవృత్తుల ననుసరించి వారి వేషభాషలుగల యసతుల మాట విడిచితిమా పురుషులకంటె స్త్రీలయందే దైవ భక్తి మతాచార సంపత్తి గానవచ్చుచున్నది. భగవంతుఁడు వారికిట్టి మనస్సిచ్చుటకుఁ గారణములేకపోలేదు. ఉదయము మొద లర్ధరాత్రము దనుక నెడఁదెగనిగృహకృత్యములతోనుఁ బిడ్డల జంజాటముతోను మగఁడు అత్తమామలు బావలు మఱఁ దులు లోనగువారి నుపచరించుటలోను, వచ్చెడి పోయెడివారి నాదరించుటలోను, గాలమంతయుఁ గడపు స్త్రీలకు మనస్సు దేవునిపై పోనిచ్చుటకే యవకాశము దొరకుట యరుదు. కాబట్టి పురుషులవలె వారు నుండిన వారికిఁ గడతేఱు మార్గమే కలుగదు. ఆ లోపము వారించుటకు గాను నట్టి మనస్సు భగవంతుఁడు వారి కిచ్చెను. ఇట్లు చెప్పుటచే వెలగల చీరలు నానాభరణములు ధరించి తమ్మెవ్వరైనఁ జూచుచున్నారో లేదోయని నలువైపుల బిక్కి రి చూపులు చూచుచు దేవాలయములకుఁగులుఁ కుచుఁ బోవువారందఱు భక్తురాండ్రని నా యభిప్రాయముగాదు. వారియందు భక్తిగలదో లేదో యా భగవంతునకే యెఱుక. భక్తి కవియన్నియుఁ జిహ్నము లెట్లు గావో గలిగియు భక్తుల మనిపించుకొనవలయునని చింపిరి గుడ్డలతోఁ బోవుటయు నట్లే భక్త లక్షణముకాదు. ఎట్టిదైనను శుభ్రవస్త్రము పరిశుద్ధ మనస్సు ముఖ్యములు.

1. దేహరక్షణమందును, గృహకార్య నిర్వహణమందును సతీసాహాయ్యము లేని పురుషుఁడు పూర్ణ సమర్థుఁడు గాఁడు. పురుషసాహాయ్యము లేకయు స్త్రీ సమర్థు రాలగును.

2. గర్భధారణ, ప్రసవ, శిశుపోషణాదులందుఁ బురుషుఁడు కేవల వ్యర్థుఁడు

3. ఇంద్రియనిగ్రహమందును బురుషునికంటె స్త్రీయే సమర్థురాలు. పతిహీనమైన స్త్రీ యౌవనదశయం దుండియు బ్రహ్మచర్యము సాధించుటయు. భార్యాహీనుఁడైన పురుషుఁడు వృద్ధుఁడు సంతతి కలవాఁడునయ్యు జారుఁ డగుటో మరల పెండ్లి చేసికొనుటో తఱచు చూచుచున్నాము.

4. పురుషులకంటె స్త్రీలకుఁ గామ మెక్కు వ. అట్టులయ్యును బురుషుఁడు స్త్రీని వెదకికొనిపోవునేకాని యెంతో చెడిన గుడిసెవాటిలంజతప్ప వేశ్యయును బురుషుని వెదకుకొని పోదు.

5. తండ్రి చచ్చిన బిడ్డలను దల్లి దరిద్రురాలయ్యును భరించునుగాని తల్లిలేని బిడ్డలను ధనికుఁడయ్యుఁ దండ్రి భరించుటకు మిక్కి లి కష్టపడును.

6. స్త్రీకి దూరాలోచనము లేదేని పురుషునకు సమీప దృష్టి తక్కు వ. లోకమునఁ బ్రసిద్ధికెక్కి న పతివ్రత లెందఱో గలరుగాని యేకపత్నీవ్రతు లెందఱుగలరో చెప్పుము. కావున స్త్రీజాతి యంతయు దుష్టమని పురుషజాతికంటె జఘన్యమని తలంపకుము. పురుషులందఱు దుష్టులని బ్రాహ్మణులందఱు భ్రష్టులనిన నీ వంగీకరింతువా? అట్టులే స్త్రీల నందఱ సమష్టికి దూషించుట యని తలంపుము. కావుననే నొక స్త్రీ గుణవతి కాదని రూఢిపఱచుకొని పిమ్మట దూషింప వలసియుండిన దానిని మాత్రము దూషింపుము. పూర్ణముగ విచారింపక యనుమానములతో నెట్టివారిని దూషించి వారి పాపములను పంచుకొనకుము. కొందఱు స్త్రీలను బశువులను జూచినట్టు చూచి తమ పశుత్వము వెలిపుచ్చుచుండుట చూచితిని గాన నింతదూరము వాస్త వార్థము వ్రాయవలసివచ్చెను.

## భార్యాభర్తృ సంబంధము

స్త్రీ పురుష తారతమ్య మెఱిఁగించితినికదా. ఇఁక భార్యాభర్తృ సంబంధమునుగూర్చి తెలిపెదను. ఏ యింటినో నీవు, మఱి యే యూరనో యే యింటనో నీభార్య పుట్టుటచేత మీ యిరువుర సంబంధము కాక తాళియమని యెంచకుము. పరమోద్దేశమైన మోక్ష మొక జన్మమున లభ్యపడదనియు దానికై యనేక జన్మము లెత్తవలసియుండు ననియు ఆకారణముచే నొకజీవి తానే తన భార్యయందుఁ బలుమాఱు పుట్టుననియు నిట్లు

పుట్టు కోరికయే సంతాన కాంక్షయనియు నిది భగవత్ప్రాప్తికి సాధనమై భగవత్కల్పిత మగుట దివ్యము పవిత్రమనియు ముందు చెప్పితినిగదా. ఇంక మన సృష్టిక్రమము చూడ "ప్రకృతి యందు నేను గర్భముంచెదను. అదియే చరాచర ప్రపంచమునెల్లఁ బ్రసవించుచున్నది" యని భగవంతుఁడు చెప్పినట్లు భగవద్గీత యందున్నది. ప్రకృతి జడము. స్త్రీ యండకమందలి గ్రుడ్డువలె స్వతంత్రించి పనిచేయు శక్తికలది కాదు. జీవుఁడు చైతన్యము కలవాఁడు. పురుషుని రేతస్సునందలి జీవకణ మీ జీవుఁడే కదా. ఈ రెంటికి కూడిక సంఘటింపఁ జేయువాఁ డీశ్వరుఁడు. ప్రకృతి జీవుఁడు రెండు చేరినఁగాని ప్రపంచసృష్టి లేదు. భార్యాభర్తలు కలసినఁగాని శిశువు కలుగదుకదా. కావున జీవ ప్రకృతిసంబంధ మనాదిసంబంధము ఇది ఱాలుఅప్పలు మొదలు బ్రహ్మపర్యంతమైన సమస్తమునందుఁ గలదు. ప్రకృతిసంబధమును జీవుఁడు వదలించుకొనుటే మోక్షము. ఇది పరిణామక్రమమున లభించును. దీనినే క్రమముక్తి యందురు.

ఒక్కఁడుగ త్రోవ నడవరాదని శాస్త్రము గావున బాటసారి మఱియొక బాటసారి సాహాయ్యముఁగోరి యిరువురుగఁ బ్రయాణము చేయుదురు. ఇట్లు చేయుట యిరువురకు లాభకరమే ఒక చెట్టు క్రింద దిగినను నొకఁడు స్థలము బాగుచేసి రాలేర్పఱచి ప్రొయ్యిపెట్టి పుడక లేఱులోపల మఱియొకఁడు బావికో యేటికోపోయి స్నానము చేసి నీళ్లు తెచ్చును. వంటచేసికొని యిరువురు భుజింతురు. ఒకఁ డెందేని పోయిన రెండవవాఁడచ్చటఁ గావలి యుండును. వా రా విధముగ నొకరి కొకరు తోడుపడుచుఁ బయనింతును. దేహయాత్రయు నిట్టిదే. అనేక జన్మములే యనేక ఘట్టములు. భార్యాభర్తలే పరస్పర సహాయులైన బాటసారులు. వీరు కడపటి దశవఱకు నొకరి నొకరు విడిచి పోవువారుకారు. ప్రతి ఘట్టమునందుఁ గూడ దిగుచుఁ గార్యములు పరస్పరము కావించుచు మరలఁ బయనించువారు. వీరిరువురు విడిచిన స్థల మొక్కటే. చేరు స్థలము నొక్కటే. కావున ఘట్టము ఘట్టమునందు వేఱు వేఱు సహాయుల వెదకుగొనరు. ప్రాంతసహాయులుండిన నొకరి స్వభావము మఱియొక రెఱిఁగి వర్తింతురు గదా. అంతవఱకు నొకరి ముఖమును మఱియొకరు చూడకుండినను వివాహము కాఁగానే యద్భుతప్రీతి జనించుటకు పూర్వజన్మ స్నేహబలమే కారణము. ఈ విషయ మిట్టిద యని మన పురాణాదులు ఘోషించుచున్నవి. వృక్షజీవి శాస్త్రములు దానిని బలపఱుచుచున్నవి. ఱాలయందలి స్త్రీపురుషతత్త్వములు నే నెఱుఁగును గాని వృక్షజీవిశాస్త్రముల వలన నేను గ్రహించిన వానిలో నుండి యొకటి రెండు విషయములను తెలిపెదను.

బాలకహితచర్యయందుఁ జెప్పిన చింతగింజను స్మరింపుము. దానియందు స్త్రీ పురుషతత్త్వములు రెండు గలసి యొక దేహమునందే యుండును. దీనియం దిది పురుషతత్త్వమని యిది స్త్రీ తత్త్వమని చెప్పసాధ్య పడదు. అమీబాయను జీవజంతువునం దిట్టి విధమే కానవచ్చుచున్నది. దీనిని గుఱించి కొంత చెప్పితిని.

మఱికొన్నిటియం దర్ధనారీశ్వరునియందువలె స్త్రీతత్త్వ పురుషతత్త్వములు వేఱువేఱని నిర్దేశింప సాధ్యమగునుగాని ఛేదింపక విడఁదీయ సాధ్యము కాదు. మఱి కొన్నిటియందు స్త్రీతత్త్వమొక దేహమునందును బురుషతత్త్వము మఱియొక దేహమునందు నుండి దైవము కారణముగ నీ రెంటికి సంగమము కలిగి సంతాన ముద్భవించును. ఈ కలియుట యాదృచ్ఛికము గాదనియు నేదియో ప్రబల కారణము వానిని రెంటినట్లు కలుపు చున్నదని తెలుపుటకై యొకదృష్టాంతము చూపెదను. ఏదియైన యొక గుంటలోని నీళ్ళ నిటునటు త్రోచిన పాఁచి గానవచ్చును. గదా. ఈనాఁచు చూచుటకు నారలు నారలుగా నుండునుగాని వీనిని బరీక్షించి చూచిన వెదురు గొట్టమువలె గణువులు గలిగి యొక గొట్టము మఱియొక గొట్టము గణువులోనుండి పుట్టినట్లు గానవచ్చును. ఇవి తీఁగలవలె నీళ్ళలో పొడుగున వెరిఁగి పోవుచుండును. ఈ తీఁగలలో కొన్ని పురుషతత్త్వము గలవి, కొన్ని స్త్రీ తత్త్వము గలవి. సమీపమున నున్నను నొకదానిని మఱియొకటి యఁటక దేనంతట యది పెరిఁగిపోవుచున్న యా దారములు వసంతకాలము రాఁగానే స్త్రీ పురుషతత్త్వములు కలవానికొనలొకటి మఱియొక దాని ప్రక్కకై పోవ నారంభించును. చక్కఁగఁ బోవుట మాని వంపుతిరిగి యొకదానిని గూర్చి మఱి యొకటి పోయి తుదకు రెంటికొనలు కలసికొని పోవును. అప్పుడు దానియందు బీజము లేర్పడి యవి క్రింద రాలి గుంటయడుగునఁ బోయి చేరును. ఈ నూతన బీజములు పుట్టఁగానే తల్లిదండ్రులైన నాఁచుతీఁగ లెండిపోవును. అధమములైన తరగతులందెల్ల సంతానోత్పత్తి మాతాపితృ వినాశహేతువు. గింజలు ముదరగానే పూవులెండిపోవును గదా. ఆఁడు తేనెటీఁగకు గర్భము నిలువఁగానే మగయీఁగ చచ్చును. పై మృగజాతులకు వచ్చు వఱకు నిదిస్వభావముగఁ గనఁబడుచున్నది. మీఁద చెప్పిన స్త్రీ పురుష తత్త్వములు గలనాఁచుతీఁగలు కలయుటందొక దైవతంత్రము కానవచ్చుచున్నది. ఇవియవి కలసి గుంపుగా పెరుఁగుచుఁ బోవునపుడు ఋతుకాలమున కేవలసమీపమున

నుండు దానిని విడిచి దూరముననుండు దానితో కలియుటకై పోవుట కలిగినప్పుడది దైవతంత్రముగాక మఱియే మగును? ఇట్టులేగదా స్త్రీల గర్భమందును జీవాణువు తనదియని యేదో యొకటి యున్నట్టు గ్రుడ్డును వెదకికొని పోవునేకాని యెదుటనున్న యే గ్రుడ్డులోనైనఁ దటాలునఁ గలియునా?

దూరమున నుండువానిని పరస్పర మాకర్షింపఁ జేయు శక్తి యొకటి యుండవలయునుగదా? అటులేదేని యేది దగ్గఱ నుండిన దానితోనేకదా కలియవలయును. అట్లు కలియకుండుటయుఁ గానవచ్చుచున్నది. కావున వీనిని పరస్పర మాకర్షింపఁ జేయు శక్తియే దైవశక్తి యనియు ఆ రెండును బూర్వజన్మముననుు దశాంతరంబుగఁ గలసి యుండవలెననియు ఆ స్నేహమే వాని నిప్పుడిట్లు తక్కి నవానిని నిరాకరించి తమవస్తువునే వెదకికొనునట్లు చేయుచున్నదనియు నేర్పడెను.

ఇట్టులే జంతుజాలమందును గానవచ్చును. మీఁద చెప్పిన ఆమీబా జాతియందు కణములో నాభి యొకటి యుండును. దాని సమయము వచ్చినపుడు ఈ నాభియే రెండు భాగములయి యొకభాగము కణమున నొకప్రక్క ను మఱియొక భాగము కణమున మఱియొక ప్రక్క ను జేరును. ఇట్లు నాభి రెండుగఁ జీలఁగా నొక్కొ క్క భాగములో నొక్కొ క్క నాభి యుండునట్లు తన దేహమే రెండుగాఁ జీలును. ఆ రెండు మరలఁ బెరిఁగి యట్లే చీలుచుండును. దీనివలనఁ దండ్రియే కొడుకను సూక్తి సత్యపడెనుకదా.

ఓషధులయందుఁ గానవచ్చునట్టే జంతువులందును స్త్రీ పురుషతత్త్వములు వేఱు వేఱు నొక దేహమునందే కానవచ్చుటయుఁ గలదు. పరిణామక్రమమున వృద్ధియయి తుదకు స్త్రీతత్త్వమునకు వేఱుగను పురుషతత్త్వమునకు వేఱుగను దేహములు గలిగెను. ఈ స్త్రీపురుష భేదము జీవులందే కలదని ద్వైతులును దేహములందే గాని జీవులం దీ భేదము లేదని తక్కి నవారును చెప్పెదరు. ఏది యెట్లుండినను భార్యాభర్తృ సంబంధ మనాదియనుట నిర్వివాదము.

మొదట నొకటిగనుండు స్త్రీపురుషత త్త్వములు రెండుగ క్రమక్రమముగ చీలిపోవుటకు కారణము నాలోచింపుము. భగవంతుఁ డొక్కఁడే పురుషుఁడు. తక్కి న చేతనా చేతనాత్మక ప్రపంచమంతయు స్త్రీ ప్రాయమను వాక్యమర్థవంతమే. అది ప్రకృత మటుండనిచ్చి జీవప్రకృతులతో రెంటిలో జీవుఁడు పురుషతత్త్వము గలవాఁడని స్త్రీతత్త్వము ప్రకృతియనిముందు నేను జెప్పితినిగదా. ప్రకృతినుండి జీవుఁడు విడువడుటే మోక్షముగాఁగను జెప్పితినిగదా. ఇది నీవు స్మరించితివేని క్రమక్రమముగ స్త్రీ పురుష తత్త్వములు వేఱగుటకు గారణము తెలియును. స్త్రీ పురుష తత్త్వములు దేహమునకేగాని యాత్మలకు లేవనియు నిద్దఱు బాటసారు లొక చెట్టుక్రింద దిగినపు డొకఁడు స్త్రీ కార్యములై న పాకాదులు దీర్పఁగామఱి యొకడు పురుషకార్యములైన పదార్థార్జనాదు లొనర్చు నట్టులే జీవులును గార్యోపయోగులైన దేహములు ధరించి పరస్పరము తోడుపడుచుండుననియుఁ దెలిసికొనుము. ఇందొక రెక్కు వ మఱియొకరు తక్కు వగారు. పురుషకార్యములు చేయుచునే పురుషులును స్త్రీ కార్యములు చేయుచునే స్త్రీలును మోక్షము నందవచ్చును. భగవత్సేవ చేయువారు భాగవతులు. పురుషులు భగవత్సేవ చేసి తరించిరేని స్త్రీలు పురుష సేవచేసి తరింపవచ్చును. ఈ విషయ చర్చ యిప్పు డప్రస్తుతము కావున మఱియొక సమయమునఁ జర్చించెదను.

భార్యాభర్త లిట్లు యాత్రచేయుచుఁ జేయుచు రాఁగా రాఁగా కొంతకాలమునకుఁ బతివ్రతయైన స్త్రీ భర్త సేవచేఁ దరించిపోఁగా పురుషుఁడు మిగులును. లేక పురుషుఁడు జ్ఞానియై విరక్తుఁడై సన్న్యాసియై దారపుత్రాదిసంగమము వదలుకొని ముక్తుఁడగును. ఇట్లు తరించిపోవువఱకు బంధము వదలదు.

ఈ తత్త్వార్థము తెలియనివారికి దారపుత్రాది సంగమము బంధక మగును గాని తత్త్వ మెఱింగి వర్తించువారికిఁ గాదు. జ్ఞాన కర్మ భక్తి యోగులకు సంసారము బంధము కానేరదు. ఒకరికొకరు తోడుగఁ బ్రయాణము చేయు బాటసారులు సుగమముగ గమ్యస్థానము చేరునట్లు అనుకూలురగు దంపతులును సుఖముగ దేహయాత్ర జరుపుచుఁ దరింతురు. ఇరువురు కూడఁ బయనింపవలసి వచ్చినపుడు పరస్పరము కలహమాడుచు పయనము చేయుట మేలో పరస్పరమైత్రితో చేయుట మేలో యాలోచింపుము.

జన్మజన్మమునఁ తల్లిదండ్రులు బిడ్డలు మాఱుచుందురు గాని భార్యాభర్తలనేక జన్మములవఱకు వృక్షదశయందును పక్షిమృగదశలందును కూడా భార్యాభర్తలుగానే యుందురు. దీనిని స్థాపించు విషయములు మన గ్రంథములందే గాక బౌద్ధ గ్రంథములందును గానవచ్చుచున్నవి. అవతార విషయము నాలోచింపుము.

విష్ణు వే స్వరూప మెత్తిన లక్ష్మిదేవి దాని కనురూపమైన రూపమెత్తుచుండును. 'విష్ణోరేషాఽనపాయినీ' యని కలదుగదా. ఈ విధము త్రిమూర్తులందును గానవచ్చుచున్నది. ఇట్టి ధర్మము దేవతలందే గాక మనుష్యులందును గలదు. పూర్వజన్మముల భార్యాభర్తలుగా నున్నవారే మరల భార్యాభర్తలై నట్టనేక కథలు కలవు. ఆర్యకథానిధియందుఁ గొన్ని చెప్పితిని.

గౌతమబుద్ధుఁడు విరక్తుఁడై యుండుట చూచి యాయనను సంసారమార్గమునకుఁ ద్రిప్పవలయునని తలఁచి యాయన తండ్రి యొకనాఁడు బాలికలకు బహుమతులు పంచుకార్యమున నతని నియోగించెను. ఎందఱో రూపవతులు, భాగ్యవతులుగానుండు కన్యలందఱు వచ్చి యతఁడిచ్చు బహుమానములఁ గొనిపోయిరి గాని యశోధరయను కన్యక వచ్చినపుడు మాత్ర మతనికి ననురాగము జనించి యామెను బెండ్లాడఁ గోరెను. అప్పు డతని మిత్రులు "రాజకుమారా ! యెందఱో రూపవతులగు కన్యలందఱు వచ్చినను నీవుపేక్షించి యీామెను మాత్రము కోరుటకుఁ గారణమే" మని యడిగిరి. "ఈమెయు నేను నెన్ని జన్మలనుండియో భార్యాభర్తలుగా జనించు చున్నాము. నే నేజాతియందుఁ బురుషుఁడుగఁ బుట్టిన నీమె యా జాతియందుఁ స్త్రీగాఁ బుట్టుచున్నది." అని తాను మగ పులిగానున్న కాలమున నామె యాఁడుపులిగా నుండుట చెప్పి యీ సంబంధ మనాది యని చెప్పెను.

ఈ విషయము మనస్సులో నిలిపి ప్రవర్తించిరేని భార్యాభర్తలలో మనస్తాపములు కలహములు పగ్గి సంసారము సార్థకమగును. జ్ఞానాదికారణములచే సంబంధము తెగిపోవువఱకుఁ గలసిమెలసి యుండుట బాగు. లేక స్త్రీ పురుషుల బ్రహ్మచర్యమో సన్న్యాసమో సాధించుట శుభము. ఈ యర్థమునే భర్తృహరియు బోధించెను.

## కుటుంబ సౌఖ్యము

గుణవంతులు బుద్ధిమంతులు నగు దంపతులు గృహము భూలోకస్వర్గమే అంతకు మించిన సుఖము సంసారులకు భూలోకమున లేదు. నిజమైన విరాగుల సుఖ మింతకంటె గొప్పది గావున సంసారుల కని చెప్పితిని. సంసారమునందొకప్పుడు గాకున్న నొకప్పుడైన భయము కలుగునుగాని వైరాగ్యమున భయమే లేదు. అట్టి భూలోక స్వర్గమును దమ తెలివిమాలిన చేష్టలచేఁ గొందఱు స్త్రీ పురుషులు ఘోర నరకముగఁ జేయుదురు. ఇట్టి చేష్టలు గొన్నిటిని జెప్పెదను.

1. పరస్త్రీ సాంగత్యము భార్య యింటికి రాకముందు గాని వచ్చిన తరువాతఁగాని పురుషుడు పరస్త్రీ సాంగత్యము చేయుట సంసారసుఖలతకు వేరుపురుగువంటిది. పురుషుఁడు చేయు నీ దుండగము భార్య యెంత చిన్నదైనను ఆమె మనస్సును గోయుచునే యుండును. ద్రోహము చేయఁబడిన యిట్టి స్త్రీకిఁ బతియందు భక్తి విశ్వాసము లెట్లు కుదురును? అతని సుఖదుఃఖములు తన సుఖదుఃఖములుగా నెట్లు చూచుకొనును? వానిని జూచినపుడంతయు నా నీచుని పాపము వాని ముఖమున వ్రేలాడుచుండునట్లు ఆమెకు గోచరించును. వాఁ డెచ్చటఁ బోయినను ఱంకుతనమునకుఁబోయెననియే యామె తలఁచును. వాఁడు మంచివస్త్రము ధరించినను ఏ లంజను సంతోషపెట్టుటకో యనుకొని చాటునందైన సుఖము మటమట మాడ్చును. వాఁడు నవ్వినప్పు డది నవ్వదు. అట్టివానికిఁ జేయు సేవను రాచకొలువుగను, పీనుఁగునకుఁ జేయు శృంగారముగను దలంచుచుండును. ఆ యిల్లాలు సంతోష మెఱుఁగదు. కడుపునిండఁ గూడు తినదు. తినినను దేహమునకుఁ బట్టదు. తూఁగుటుయ్యె లపైఁ బరుండినను గంటినిండ నిద్రపోదు. దానిపాలికి వీడు వల్లకాడు రెండును సమములే. గృహమే కారాగృహము. ఒంటరిగ నేలకు ఱొమ్ముల నొత్తి పరుండుగతి వచ్చినప్పు డది యెంత దుఃఖించునో యా దుఃఖ మా పురుషుని రౌరవాది నరకములపాలు చేయక యూరక యేల పోవును? మనుష్యులు సహించినను నిట్టి చెడునడవడిగల పాపాత్ముని దేవుఁ డెట్లు సహించును ?

పతివ్రతల కన్నులనుండి రాలు వేఁడినీళ్లు నీళ్లు కావు. నిప్పుకణములు. అవి కాఱునట్లు చేసినవానిని నిర్దహింపక మానవు. ఈ కారణముచేతనే భర్త తమకుఁ గీడు చేసినను సాధ్వులు పతిక్షేమము గోరినవారగుట నతనిపట్ల విషమాభిప్రాయము గలవారు గారు. పరునింట బానిసయై కూటి నిమిత్తమై కూలిచేసి జీవించుదానివలెఁ దన్నుఁ దలఁచును. ఒక సారి ఱంకుతనము చేసినను వానిపట్ల భార్యకు సంపూర్ణ గౌరవముండదు. ఎట్లుండును? ఇట్టి కార్యములే భార్యచేసిన భర్త సంతోషపడుచుండునా? దీనికిఁ దోడు వాఁడు రోగములను దగిలించుకొనెనా యేమి సంతోషముతో వానికిఁ గాఁపడములు వేయును? కట్టులు కట్టును? ఉపచారములు చేయును? ఆ రోగములు తనకుఁ దగిలించెనా యిఁకఁ జెప్పవలసినదే లేదు. భర్త జారుఁడై భార్యయం దుపేక్షయుఁ గలవాఁడయ్యెనేని యా

యిల్లాలి కా యిల్లు నరకమే. ఈ కారణములచే నిపేక్ష ముహూర్తమునకునుముందుగాని వెనుకఁగాని భార్య చెడు నడవడి గలదై యొకసారి మాత్రమే వ్యభిచరించిన నది తన మనస్సున కెంతపరితాపముగలిగించునో యానీచుఁడు తలఁపలేఁడేమో ధర్మార్థ కామముల నిన్ను నతిక్రమింపనని ప్రమాణము చేసిన తానే యొకసారి వ్యభిచరించినఁ దన భార్యమాత్ర మొకసారి యేల వ్యభిచరింపరాదు? తాను బదిమార్లు చేసిన నదియును బదిమార్లేల చేయరాదు? నీవు నన్ను విడిచి చరించినపుడు నిన్ననే నేల విడిచి చరింపరాదని యది యడిగిన నేమి యుత్తరము చెప్పఁగలఁడు? వ్యభిచరింపరాదను నీతి స్త్రీలకు మాత్రమే యన్వయించును గాని పురుషుల కన్వయింపదా? ఈ విషయమున మగవారి కొక నీతి యాఁడువారి కొకనీతి గలదా? ఆఁడు వారు వ్యభిచరించినఁ బాపము వచ్చిన మగవారు వ్యభిచరించినఁ బుణ్యము వచ్చునా? తాను బరస్త్రీని గోరుట తన భార్య పరపురుషుఁ గోరుట కనుజ్ఞ యిచ్చుట యనియు జారుఁడైన తండ్రి పితృగౌరవమునకుఁ దగఁడనియు శాస్త్రములు చెప్పుచున్నవి. జారుఁడగు భర్త జారిణియైన భార్య నాక్షేపింపరాదు. తనవలె దానికిఁ గామము సుఖకాంక్ష లేవా?

దంపతులలో నెవరియం దీ వ్యభిచారగుణ మున్నను సంసారమున సుఖము లేదు. అనేక సమయములఁ బురుషుని చెడునడవడియే స్త్రీని దుష్టచరిత్రను జేయుచున్నది. దాని ఫలమును వాఁడు పడ్డితో ననుభవించును. ఇరువురు వ్యభిచారము మరగిన ఆ సంసారమును....తరువాత వ్రాయుటకు నాకుఁ దోఁపలేదు. పురుషుఁడు జారుఁడగుటచేఁ గలుగు నష్టలన్ని యిన్ని కావు. రోగబాధ లేకుండినను అవమానము ప్రాణాపాయము మాట యటు లుంచినను బరస్త్రీయందుఁ బుట్టిన పుత్రులు వీనిపుత్రులు కానేరరు. వారియందుఁ బుత్ర శబ్దమే యన్వయింపదు. ఆ బిడ్డలచేతి నిప్పునకు నీళ్లునకుఁగూడ వీనికి యోగ్యత లేకుండఁగా వీనిని వారు భరించు టేటిమాట. వీనివలె వీని భార్య జారిణియై బిడ్డలఁ గనెనా యా బిడ్డ లెబండి వానికో వంటవానికో పొరుగువానికో తురకకో దూదేకులవానికో తన భృత్యునికో మిత్రునికో కలిగెనని తెలిసియు వారిని తన బిడ్డలవలె భరింపవలసిన భారము సంఘమర్యాదను చుట్టములనుబట్టి వీనితలయందే పడుచున్నది. అంతఃకరణమనునది యొకటి కలవాని కంతకంటె వేఱుశిక్ష గావలయునా? భార్యనడవడి తెలియక వారిని లాలించి ముద్దాడునపుడు వాని భార్య వానిని జూచి యేదో నెపముపెట్టి ముఖము నెదుటనే నీ బ్రతుకునకు బిడ్డలుకూడనా యని నవ్వును. ఇట్టి నీచసంతాన మిచ్చు నిప్పు నీళ్లు వీని నే మాత్ర ముద్ధరింపఁగలదు? లంజకొడు కబ్బకు పెట్టు తద్దినమన్నట్టు వీరు పెట్టు శ్రాద్ధము లెవరిని రక్షించునో ! జన్మము తరింపఁ జేసికొనుటకై తానే తన భార్యయందుఁ బుత్రుడుఁగా బుట్టుట యను కార్యము నాశమాయెఁగదా. ఆ బిడ్డలకు వీఁడు జనకుఁడు గానపుడు పితృ భక్తి రమ్మనిన నెట్లు వచ్చును? ఏ నీచులనైనఁ జేరుటకు భక్తి యంత సిగ్గుమాలినదా? కావుననే తండ్రివై ద్వేషించు వాఁడు పరుని రేతస్సునకు జన్మించినవాఁడని శాస్త్రము చెప్పుచున్నది.

భార్యాభర్తల కామము పవిత్రమని దైవికమని చెప్పితినిగదా. పరమ పవిత్రమని దైవమేయని చెప్పియుండిన సత్యమున్నదున్నట్లు చెప్పినవాఁడనై యుందును. ఏల యనెదవా ధర్మమునకు విరోధము కాని కామము నేనే యని భగవంతుఁడు భగవద్గీతయందుఁ జెప్పెను. భార్యభర్తల కామమే ధర్మమునకు విరోధము కానిది అదియైనను ఋతువు, కాలము, దేశము తెలిసి నిర్మలభావముతో సంతానాపేక్షచే ననుభవించిననే కాని స్వప్రయోజనార్థమైనఁ గాదు. ఈ కామము దైవప్రేరితమనియు ముందు చెప్పితిని. అట్లు ప్రేరించుటయందు భగవంతు నుద్దేశము వాఁడు సరియైన మార్గమున నడచి తరింపవలయుననియేకదా. సరియైన మార్గము భార్యా భర్తృ సంగమమే. ఆ యిరువురకుఁ గలుగు సంతానమే కదా తారకమగును. అట్టులగుటచేత పురుషుని వీర్యము భార్యయందుఁ దప్ప మఱియొక తెయందుఁ గాని మఱియొక విధముగఁ గాని దుర్వినియోగపఱచుట భగవంతుని యుద్దేశమునకు జీవిస్వభావమునకు స్వధర్మమునకు విరోధముకదా. ఇట్టి య కార్యమును గామోద్రేకముచే వాఁడు మరలఁ జేయుకుండుటకై యే యే విధమున నరకలోక భూలోకముల శిక్షలనుభవించునో యూహింప సాధ్యమైనచో నూహింపుము. జ్ఞానము వైరాగ్యము కలుగు వఱకు భార్యభర్తల పరస్పర సంబంధము వీడిపోవునని తలంపకుము. నీవు నీ స్నేహితుఁడు త్రోవప్రయాణము చేయుచున్నారనుకో. సరియైన మంచిమార్గము విడిచి యే పువ్వునకో కాయకో యాశపడి నీవు తప్పుత్రోవఁ ద్రొక్కి తి వనుకో, ఆ పూలు కాయలు క్షణమాత్ర మానంద మిచ్చునవేగాని కలకాలము నీ కుపయోగపడునవి కావు. ఆ పూలకు కాయలకై పోయిన తప్పుత్రోవలో రాలు ముండ్లు గుండ్లు త్రొక్కి కాళ్లు వాఁచి వీనిమీఁది యాశచాలురా దైవమా, సరియైన సుఖమార్గము విడిచి యేల వీనికై వచ్చితినని తెలివి తెచ్చుకొని మరల మునుపటి మార్గమునకు వచ్చి నీతోడి బాటసారిని గలసికొందువుకదా. అట్టులే యధర్మమార్గముల వర్తించు వారందఱు శిక్షితులై బుద్ధి తెచ్చుకొని మరల సరియైన మార్గమున వత్తురు బుద్ధిమంతులు

సరియైన మార్గము విడిచిపోరు. వారికిఁ బ్రయాణము శీఘ్రముగను సుఖముగనుసాగును. వేగమ గమ్యస్థానము చేరుదురు. ఈ రెంటిలో నీ కేది బాగని తోఁచిన నా త్రోవయందు నడుపుము. తన భార్యను పరుఁడు చెఱిచినఁ దన కెట్లుండునో తా నితరుని భార్యను జెఱిచిన వానికి నట్లుండును గదా యని తలఁచువాడు జారుఁడు కానేరఁడు. ఆ మాత్రము జ్ఞానము లేనివాఁడు మనుష్యుఁడెట్లగును?

విధవలకు వేశ్యలకు భర్తలులేరుగదా, వారితోఁగలయ వచ్చునా యందువేమో ? హరి హరీ ! యది మీఁదఁ జెప్పినదానికంటె నీచమైనది. మహాపాతకము. విధవలకు వేశ్యలకు భర్తలు లేరని తలంపకుము. మన కన్నులకుఁ గానరాక పోయినంతమాత్రమున లేదనువాఁడు సత్యము తెలిసినవాఁడు గాఁడు. సతి చేసిన పాపంబుననే దాని పతి తొలుతఁ జచ్చునని ప్రమాణము. వైధవ్యము దాని కొక శిక్ష. దానివలన నది యింద్రియ నిగ్రహము సంపాదించుకొని మఱుజన్మమున మరల మునుపటివలె దుష్కా మమునకు లోనుగాకుండ వలయునని శిక్ష కేద్దేశము. అట్టి శిక్షయందు మరల నదే పాపము చేసిన దానికిఁ గలుగు శిక్ష యెట్టిదని చెప్పవలయును? దొంగతనము చేసి కారాగృహమున దుఃఖ మనుభవించుచు మరల నందు దొంగతనము చేసినవానికి నెక్కు వ శిక్ష కలుగును గదా? అట్టులే యిదియును. కావుననే పతి హీనలైన సాధ్వులు సన్న్యాసివేషము వహించి బ్రహ్మచర్య వ్రతము నడుపుదురు. పూర్వజన్మమునఁ జేసిన పాపములకు దీర్ఘరోగాదు లెట్టులో వైధవ్య మట్టిదే. ఆ రోగముల వృద్ధిచేయు కార్యములెట్లు చేయరాదో పతిహీనులు పరపురుషసాంగత్యము చేయరాదు. భర్త పరలోకమందుండినను వీరికి సంబంధము తెగిపోలేదు. మరుజన్మమున మరల భార్యభర్తలు గాఁగలరు. అట్టి పతిహీనలను బాపకార్యములకుఁ బ్రేరించువారును మహాపాతకులే. ఒకరు మూత్రమువిడిచిన పాత్రమున నీవు మూత్రమున విడుతువా? ఒక రెంగిలిచేసిన దానిని నీవు నోటఁ బెట్టుదువా? వేశ్య లిట్టి వారుగాక మఱి యెట్టివారు ? వారి నోళ్లెందఱు ఎంగిలి యుమిసిన తోలుగిన్నెలో ! వారి మూత్రపాత్రములఁ గూర్చి చెప్పవలసినదే లేదు. కావుననేకదా పశువులతో సంగమించువాఁడును వేశ్యలతో సంగమించువాఁడును ప్రాజాపత్య వ్రతము కావింపవలయునని శాస్త్రము చెప్పుచున్నది. వేశ్యల కంటె బశువులే పరిశుద్ధములు.

విశేషముగఁ జెప్పఁదగిన విషయములు గ్రంథవిస్తర భీతిని కొంచెముగఁ జెప్పితిని. దానివలనఁ జెప్పఁదగినదింతేయని భ్రమింపకుము. ఆలోచించి తక్కి నది తెలిసికొనుము.

పరస్త్రీ సాంగత్య మాయుస్సును హరించును. కాఁబట్టి తన శ్రేయస్సు గోరిన పురుషుఁడు ఏవయస్సు నందుఁగాని యేకాలమందుఁగాని తన భార్యను దప్ప నితర స్త్రీలనందఱను దల్లిదోడులవలె భావింపవలయును. తల్లి దోడులనే భార్యలుగాఁ జేసికొను నీ కాలమునఁ దల్లి దోడులుగా నెంచుమని చెప్పుటకును నోరు రాకున్నది.

2. తొలుత భార్య మగనియింటికి మగనియందు నిర్మలమైన నిండుప్రీతితో వచ్చును. మగని నన్నివిధముల నెంతో సంతోష పెట్టి తాను సుఖపడవలయునని కొండంత యాశపెట్టుకొని యుండును. అట్టి నిర్మల ప్రీతి మగని తెలివితక్కు వ చేష్టలచేతను దాని యత్తల యాఁడుబిడ్డల కుచేష్టలచేతను మాఱిపోయి తాను గఠినశిక్ష యనుభవించుచుఁ గారాగృహవాసము చేయుచున్నానని తలంచునట్టి దుస్థితికి వచ్చును. అనేకుల యిండ్లలో నిట్టి దుర్దశకు ముఖ్యముగ నత్తల నాఁడు బిడ్డల దుష్టచేష్టలు వారి మాయోపాయములు వారి యోర్వలేని తనములు వారి పుల్లవిఱుపుమాటలు వారి యధికార బలము చూపవలయునను దురభిమానము దురహంకారము కారణమని కంఠోక్తిగఁ జెప్పవచ్చును. ఇవియన్నియు వ్రాయవలయుననిన నొక గ్రంథమగును. అది ఇప్పు డప్రస్తుతము. అయినను 'కొడుకు వచ్చిన కోడలు వచ్చిన మొత్తుకో' 'అంబటేఱు వచ్చిన దత్తాయనిన కొలఁతపాత్ర నా చేతిలో నున్నది కోడలా' 'అత్తవలన దొంగతనము మగనివలన ఱంకుతనము కోడలు నేర్చును'. 'కోడలిముట్టు చాండాలము కొమార్తుముట్టు మాణిక్యము' అను సామెతలే యాలుమగల సౌఖ్యము చెడునట్టిమార్గముల సూచించును. నూతన వధూవరులు పెద్దవారిచేతిక్రింద నుండుటయే యనేక విషయముల మేలయినను నిప్పటి యత్తలు నాఁడుబిడ్డలు కోడండ్రను బెట్టు నీతిబాధలు తలఁచినఁ బాశ్చాత్యుల పద్ధతియే బాగని తోఁచుచున్నది గాని యాపద్ధతియు దుష్టము గనుక నది మనవా రవలంబింపవలయునని నా తలంపుగాదు. దుర్గుణముల దుత్తలగు నత్తలకు తెలివి వచ్చునట్లు చేయుటయే నా కోరిక అది మన జాతీయ విద్యాబోధవలననే రావలయును.

దంపతుల సుఖము చెఱుచుటయందు నత్తలకంటె మిత్తులు ఆఁడుబిడ్డలు సుమా. నిశ్చతార్థమునాఁడే నీల్గవలసిన మగఁడు త్రాటిబలముచే తలంబ్రాలువఱకుండి నాఁడన్న సామెత నిజము చేయుచుఁ బుట్టువిధవలైన వారును, కొలఁది సంవత్సరములు కాపురమును చేసి త్రెంచి పుట్టినిల్లు చేరిన రండలును, దుష్టలైన యెడల

దంపతుల సుఖలతికలకుఁ గత్తుల వంటివారు. అందు వీరు బిడ్డలు లేనివారై సొగసు కత్తెలై యుండిరా వారిండ్లలోఁ బడుపాటును చెప్పలేను. వీరు చేయు దుష్టచేష్టలు కోడలు దానిమగనితోఁ జెప్పునేమో యని దానిని నేలఁబెట్టి కాల రాచుటయే గాక ముందుగనే యావగింజలంతవి గుమ్మడి కాయలంత చేసియు లేనివి కల్పించియుఁ దాము చేసినవి యవి చేసినట్టు చెప్పియు నతని మనస్సు విఱిచి భార్యపై ద్వేషము పుట్టఁజేయుదురు. కూఁతురెన్ని అంకుతనములు చేసిననుదల్లి దాచుటయేగాక యన్ని విషయములలోను దాని పక్షమే వహించి కోడలిని రాచుచుండును. కోడలి నననేల? నోరు మెత్తనివాఁడైన గొడుకును పెనములోఁ బెట్టి వేఁచును. కోడలిని చేఁ ద్రాళ్ళతోను రోఁకండ్లతోను కట్టెలతోను కొట్టు నత్తల నీ వెఱుఁగుదువా? కోడలు కొడుకు మంచముపైఁ బరుండిన మంచము క్రింద రాత్రియంతయు దాఁగి నడిరేయి తూఁగిపడి కొడుకు కనుఁగొని యేలవచ్చితివన కందిబేడలకై యను నత్తల నెఱుఁగుదువా? దంపతుల మాటలు వినవలయునని పడుకిటింటి వాకిటఁ గావలియుండు నత్తల నీకుఁ దెలుయునా ? కొడుకు తన యాఁడు శిశువునకుఁ దనపేరు పెట్టలేదను దోషముతో నా పిల్ల పెద్దదై వివాహమునకు యోగ్యురాలు కాఁగా కొడుకు మనవు మాటలాడుచోటుల నెల్లఁ దల్లిపోయి నా కోడలుత్తఅంకుటాలు, మీరు దానిపిల్లను దీసికొనవలదని కేవల మసత్యవాక్యము లాడు నత్తగారిని వినియున్నావా? నా కూఁతు రిట్టిదైనఁ గొఱ్ఱుకాల్చిపెట్టనా చీల్చి యుప్పుపోయనా కండలు దీసి కాకులకు వేయనా యని యత్తగార్లు ప్రగల్భములు కొట్టు చుందురుగాని తమ కొమార్త లెన్నియూళ్ళ నెన్ని కార్యములు చేసిరో యేమి యెఱుఁగుదురు? ఈ మాటలు వా రాడునపుడు నిజమెఱిఁగినవారు నవ్వుదురనియైన వారు దలఁపరు. కోడలు వాకిటికి వచ్చినను దేవుని జూడఁ బోయినను దురభిప్రాయముతోఁ బోయినట్టే. కొమార్త లొంటరిగ రాత్రులందు నాటకములకుఁ బోయినను పాట సభలకుఁ బోయినను రాత్రులయందుఁ దిరుగబోయి 10-11 గంటల కింటికి వచ్చినను మంచి యభిప్రాయముతోఁ బోయినట్టే. వారు వీర పతివ్రతలయినట్టు తల్లులు నటింతురు. కావుననేకదా పుట్టినింటఁ దన భార్యను దీర్ఘ కాలముంచుట దాని నంగడికిఁ దానే పంపుట యని సుమతి చెప్పెను. కొమార్తల దుశ్చేష్టలు తండ్రి వహింపఁడు గాని తల్లి యెన్ని అంకులు గర్భస్రావములైన దాఁచును.

నాయనా ! యీ విషయమై నే నొక్కమాట చెప్పెదను విను. ఆఁడుతోడులకుఁ గూడుపెట్టుట బీదవారికి బిచ్చము వేసినట్టు కరుణచేతనే గాని మఱి యే కారణము చేతను గాదు. వీరిని బోషించు భారము సోదరులపై లేదు. అయినను వారు మంచినడవడిగలవారై యుండిరా వారిని నవశ్యము భరింప వలయును. అటుగాక యే మాత్రమైన వారి నడవడి యందు సందేహము తోఁచినను తమ భార్యలపైవా రేమాటయైన నిందగాఁ చెప్పినను తతక్షణము వారి నింటనుండి వెడలఁగొట్ట వలయుననియే నా యభిప్రాయము. మంచినడవడిగలిగి యుపకారిణులై యుండిరా యవశ్యము రక్షింపవలసినదే. అటుగాక భార్యాభర్తల విషయమై లేని పెత్తనము వహించి కుటుంబ సౌఖ్యము చెఱుపఁ జూచిరా మెడపట్టి నెట్టవలసినదే. అత్త యనెడు నగ్నికి వీడు గాలి వంటివారు. వీరి బాధలు పడలేక యాత్మహత్య చేసికొనినవా రెందరో కలరు. మగఁడు చచ్చియిల్లు చేరిన దేమాత్రము నీతి మతాచారము లకు దూరమైన నడవడి గలిగి వన్నె విసనకఱ్ఱవలెఁ దిరుగ మరగెనా యది చెడినదిగాను తన కపకీర్తి తెచ్చునదిగాను నమ్ముము. ఇట్టిదాని విషయమై దయ తలఁపరాదు. వీరికిఁ బెట్టు తిండి పామునకుఁ బాలుపోసినట్లు. నాయనా! పతిహీనలందు నాకు గౌరవ బుద్ధిలేకపోలేదు. నేను దయాదాక్షిణ్యములు లేనివాఁడను గాను. అయినను దంపతుల సౌఖ్యమునకు వీరు విఘ్నకారిణులగుటను నే నేమాత్రము సహింపను. వారాత్మసుఖము గోరి చరింతురేకాని దోఁడబుట్టినవాని సంసారమందుఁ బ్రీతిగలవారు గారని నమ్ముము. నాయనా నే నింతదూరమును కఠినముగా నత్తలపై నాఁడు బిడ్డలపైఁ వ్రాసినదానికి మీ తల్లి కోడండ్ర యందుఁ బ్రీతిగలదగుటయు మీతోఁడ బుట్టినది సువాసినియై మీ యొద్ద లేకుండుటయు నా యదృష్టమే. నేను న్యాయమైన విధము చెప్పినను పక్షపాత బుద్ధి చేతనో తమపై ద్వేషబుద్ధి చేతనో యిట్లు వ్రాసితినని వారు నన్ను నిందించువారగుదురు. అయినను వాస్తవార్థము చెప్పవలసివచ్చినపుడు సగము చెప్పి విడుచుటగాని మఱియొక విధముగాఁ గప్పిపుచ్చుటగాని నా మతముగాదు. అట్లుచేసిన నీ మేలు పూర్తిగా గోరి చెప్పినవాఁడను గాకపోవుదును. కావున నీయందు దోషములని నాకుఁ దోఁచినవానిని గూడ నీ కోపమునకు భయపడక నిర్దాక్షిణ్యముగ నందందుఁ జెప్పగలిగితిని. ఇంకను జెప్పెదను. నీకు రుచింపదేని వదలిపెట్టు మంతేగాని నీకు మేలుగానిది ధర్మమునకు విరుద్ధమైనదిగాని చెప్పితినని మాత్రము దలఁపకుము. అత్తలు నాఁడుబిడ్డలు కోడండ్రఁ బెట్టు బాధలు మగవారికిఁ దెలియనే తెలియవు. మగఁడుకదా యాయనతోఁ జెప్పుకొందమా యనిన నా తల్లి దోడులపై నిందలు చెప్పవచ్చితివా యని మగఁడు తనపై ద్వేషించనో యని భీతి. కావున భార్యలు వారిలో వారే క్రుళ్ళిక్రుళ్ళి యేడ్చుచుందురు. ఇట్టి కుటుంబములును నీకును గొన్ని

తెలియునుగదా ? మీఁద చెప్పినట్టి సందర్భములలో నాఁడుబిడ్డలను వెడలఁగొట్ట సాధ్యపడదేని వారి మాటలు పెడచెవినిబెట్టి భార్యయందు భర్త ప్రీతిని బాయక యుండవలయును గాని వారి మాటలు విని భార్యను దండింపరాదు. దూషింపనురాదు. అట్లని భార్యను గలహమునకుఁ బ్రేరింపనురాదు. కొంచెము ప్రాంతపడిరేని కోడండ్రే వారికిఁ దగిన శిక్ష సింగారపుఁ గట్టచేఁ జేయుదురు. అంత వఱకు కోడలు యమయాతన పడుచు ప్రాణములు బిగఁబట్టుకొని యుండవలయును. ఇది చదువువారందఱు "అవునవును వారి యింట్లో నట్లున్నది. వీరి యింట్లో నిట్లున్నది" యని యనక తమ యిండ్లలో నెట్లున్నదో చూచుకొని కుటుంబ సౌఖ్యము చెడకుండఁ గాపాడుకొనవలయును. కారణములేక కార్యము పుట్టదు. కావునఁ గొంద అత్తలాఁడుబిడ్డలు మంచి వారుగా నుండుటకుఁ గొందఱు దుష్టురాండ్రుగ నుండుటకుఁ గారణ మాలోచింప నిట్లు తోఁచినది. చిన్నయుద్యోగములో నుండువారు లంచగొండులును తప్పు దినచర్యలు వ్రాయు వారును అసత్యము లాడువారును దుష్టులునై యుండిరేని వారు తహశీల్‌దార్లుగానో డిప్టికలెక్టర్లుగానో వచ్చినపుడు తము ముందుండిన పదవులందుండువా రెల్ల దొంగలని లంచగొండులని యింత యేల తామెట్లు చేయుచుండిరో యట్లే యితరులు చేయుచున్నారని తలఁచి వృధా క్రూరులై చేతిక్రిందివారిని నలిపి చంపుదురు తాను దొంగయైనఁ బొరుగును నమ్మఁ డను సామెత యసత్యము కాదు. అట్టే కోడండ్రపై నిష్కారణముగ దొంగతనము అంకుతనము మోపునట్టి యత్తలు నాఁడుబిడ్డలు తాము కోడండ్రుగా నుండినపు డట్టి దుశ్చేష్టలు చేసినవారని నా నిశ్చయము. తామట్టివారుగావున నితరులట్టివారినియే వారి యభిప్రాయము. మఱి కొందఱత్తలు తాము కోడండ్రుగానున్నప్పు డత్తలచే పడిన బాధలను తలఁచి తమ కోడండ్రు మాత్రము సుఖపడనేల యని యట్లేచేయుదురు.

ఇట్లు చెప్పుటచేఁ గోడండ్రందఱు బుద్ధిమంతు రాండ్రని యత్తలు నాఁడుబిడ్డలే దుష్టులని నా తలంపుగాదు. తమ కొమార్తలఁదున్న ప్రేమకంటె కోడండ్రయందు నెక్కు వ ప్రేమగల సాధ్వులను నే నెఱుఁగని వాఁడఁ గాను. వదినె మఱఁదండ్రను దోడఁబుట్టిన వారివలెఁ జూచుకొను వారును గలరు. గాని యిట్టివారు మిక్కి లి యరుదు కోడండ్రయందు గయ్యాళి గంగమ్మలు, అఱవరాని యాండాళమ్మలు, కచ్చకుఁ గాలు ద్రవ్వ కలహకంరులు, సహింపరాని చండులు; నెందఱోఁ గలరు. ఇట్టివారికి నేను హిత ముపదేశింపఁ దలఁచినవాఁడఁ గాను. 'అలవిగాని యాలిని గట్టుకొని మురిగిచచ్చెరా ముండకొడు' కన్నట్లు ఆ దుఃఖము మగ లనుభవింపవలసినదే విధి. మగవాఁడు పోయిన జన్మములో నేగయ్యాళీతోనో లంజతోనో విస్తారముగ వ్యభిచరింపఁగా ఆ బంధముచేత నీ జన్మమున నది యాలుగ దాపరించెను. ఈ కాలములో వీని భార్య (దైవము తొలుతఁ గూర్చినది) భూమియందు జన్మించియైన నుండదు. అదియు నిట్టిదయైన మఱియొకనికి భార్యయై యైన నుండును. ఇట్టిభార్యలు గలుగుట మగవానికిఁ జాల శ్రేయస్క రము. ఈలోకమునఁ గాదు. ఈ జన్మమునఁగాదు. మఱుజన్మమున అట్టి వాఁడు బుద్ధిపక్వము చేసుకొని వ్యభిచారమును దలపెట్టక స్త్రీలయందును సంసారమందును గూడ విరక్తుఁడై సుఖపడును. భార్య యంతటి ధూర్తురాలు గాక నడిమిరకమై పురుషుఁడు జ్ఞానము గలవాఁడు కాఁడేని వాని చావు కుక్క చావే. ఈ ధూర్త స్త్రీలకు మగలపైఁ బ్రీతియును బెద్దవారియెడ గౌరవబుద్ధియు నుండదు. వీరిభక్తి గ్రుడ్డిమామగారా నమస్కా ర మన్నటువంటిది. ఇంటిలోని తక్కి నవారిపై మగలతో లేనిపోని మాటలు చెప్పి కలహములు పెంతురు. వీరిట్టివారగుటకు వీరితల్లులు చెడ్డవారగుట కారణము పెద్దకాకివలెఁ బిల్లకాకిగాక మఱియెట్లు కాఁగలదు? కాకికి హంసపుట్టునా ? అట్టి దాని బిడ్డను వివాహమాడువారు తత్ఫల మనుభవింపక యెట్లు తప్పించుకొనఁగలరు. పాల సముద్రమున విషముపుట్టుటయుఁ గలదు. తల్లిచెడ్డదైనను నింటిలోని తక్కి నవారును, సహవాసులును శిక్షాపద్ధతులు ను చక్క ఁగ నుండిన నీ దోషము చాలభాగము తగ్గిపోవును. రెండవకారణ మిప్పటి విద్యాపద్ధతి. పరకీయ విద్యాపద్ధతులు పరకీయ విద్యాపద్ధతుల నేర్పక స్వీయ పద్ధతులు నేర్పునా ? పాఠశాలలయందు నీచ స్త్రీ సహవాస మొక దోషము కులకన్యల కావశ్యకములైన సదాచార పద్ధతులు నేర్పక పోవుట, పొట్టకూటివిద్య నేర్పుట, ఇత్యాది కారణములచేఁ జెడుబుద్ధులుపట్టుపడినాలుగక్క రములు రాఁగ నేతల గిఱ్ఱునతిరిగి సర్వజ్ఞత్వాభిమానము దురహంకారము వహింతురు. అనర్థకములైన యానాలుగక్షఱములు రానివారినిజూచిన హేయబుద్ధి ప్రాజ్ఞమాని నీత్వముచేఁ దిరస్కా రబుద్ధి. ఇట్టి దుర్గుణములు పట్టుపడునుగాని స్వీయజాతి విద్యచే లభించు గృహకృత్య నిర్వాహకత్వము, వినయము, దేవగురు పతిభక్తి, సుశీలత యివి కుందేటి కొమ్ములగును. కాఁబట్టి యిట్టివారిని వివాహమాడుట మొదటితప్పు. సంగీతపుఁబెట్టె వాయించుటయు వార్తాపత్రికలు చదువుటయు సింగారించుకొని కూర్చుండుటయు, గృహిణికి సంబంధములేని ప్రసంగములు చేయుటయు, ఇంటికివచ్చిన పరాయి మగవారిని పాణిగ్రహణము కావించి లోపలికిఁ దెచ్చి కూర్చుండఁబెట్టుటయు, ముఖమున నింత బూడిద కొట్టుకొనుటయు,

గృహిణీధర్మము లని తలంచు వారు వారిని బెండ్లాడవచ్చునుగాని సిగ్గుబిడియము వినయము గృహకార్య నిర్వాహక జ్ఞానములేక నీచసహవాసమున మెలఁ గినవారిని కుటుంబసౌఖ్యము గోరు పురుషులు పెండ్లాడుటకు ముందు చక్క ఁగ నాలోచింపవలయును. అల్పవిద్య హానికరము. సిగ్గువిడిచిన గృహిణి వేశ్యకంటెను చెడ్డది.

ఇట్టివారి విషయమై నేనేమియుఁ జెప్పఁ జాలఁగాని చాడిమాటలు వినిగాని, యనాలోచితముగఁ గాని నిజము తెలిసికొనక భర్త భార్యపై విరుద్ధాభిప్రాయముగలవాఁడు కారాదు. మీఁద లోపములని చెప్పిన గుణములు కలదాని యందైనను నిజమువిచారింపక భర్త ప్రవర్తింపరాదు. వాస్తవముగ నది దుష్టురాలని తోఁచిననే నేరమునకుఁ దగినట్లు దండింపవచ్చును. అని దండనములలోఁ బ్రథమ దండనము దానియెడ విముఖుఁడు విరసుఁడు నగుటయే. సాధారణముగా మట్టుమర్యాద లెఱిఁగి పెరిఁగిన పిల్లలవిషయమున మనుష్య స్వభావముగల భర్తలు చరింపవలసిన మార్గము చెప్పుట నాకుఁ గృత్యముగా నుంచుకొనితిని గాన ఆ విషయమే తెలిపెదను.

3. తమ భార్యలింటికి వచ్చునప్పటికి సర్వజ్ఞులు, సర్వశక్తిమంతులు లోకోత్తర చరిత్రలుగా నుండ వలయునని తలఁచు భర్తలు ఆకాశమునందలి పూలు శిరస్సున ధరించి యలంకరించుకొనఁ దలఁచువారు. ఇట్టి వారి యాశ లెట్లుకొనసాగును ? నాయనా ! యిట్టి కన్య నీయింటికి వచ్చునప్పటికి నెక్కు వ పక్షము 15 సంవత్సరములకు మించినదిగా నుండదుగదా. ఆ వయస్సులో నీ వెంత తెలివిగలవాఁడవుగా నెంత శక్తి మంతుఁ డవుగా నుంటివో యాలోచించి ప్రవర్తింపవలయును గాని యిప్పటి నీ వయస్సును జ్ఞానమును లోకానుభవమును బట్టి దానిని బరీక్షింపరాదు. ఇప్పటికిని నీయందెన్నిలోపములున్నవో యెంచుకొనుము. నీ యిప్పటివయస్సు దానికి వచ్చునప్పటికి నిప్పుడునీకున్నంతజ్ఞానమునకంటె నెక్కు వజ్ఞానముకలదేయగును. ఆ పిన్నవయస్సున నది సర్వజ్ఞురాలుగ నుండలేదని చిఱ్ఱుముఱ్ఱు లాడితివేని దానికి నీ తెలివితక్కు వతనమే కారణము. నీ యింటి మట్టుమర్యాదలు వ్యవహారము లాచారములు దానికిఁ దెలియకుండవచ్చును. అవన్నియు మంచితనముగాఁ దెలియఁజేయుట నీకు నీ పెద్దవారికి విధి ఒక్క సారి చెప్పినంత మాత్రముననే యదిపొరపాటు మఱపులేక యన్ని కార్యములు చక్క ఁగఁ జేయునని తలంచుటయు సరిగాదు. నీకొక్కొ క్క కార్యమునకై యెన్నిమార్లు చెప్పవలయునో యెన్నిమార్లు చేసినఁగాని యొక కార్యమున కభ్యాసపడితివో యభ్యాస పడిన వానియందును నీవు పొరపాటు పడకయే యున్నావో యాలోచింపుము. ఇంతకు నోర్పు ప్రధానము. పిన్నవారికి జ్ఞానములేనట్లు పెద్దవారికి నోర్పు లేదేని యా సంసారమున సుఖము లేదు.

4. కోడలనఁగా గృహలక్ష్మి ౣ. ఇంటికి దీపము. వంశమునకుఁ గీర్తిప్రతిష్ఠలు తెచ్చు భారము దానియందున్నది. అదియే వంశము నిలుప సమర్థురాలు. పెద్దవారిసుఖము లభివృద్ధి చేయవలసిన దదే. ఇంతభారమును వహించు కోడలిని కొంద ఱింటికివచ్చినది మొదలు బాలసవలెను గూటికి మాత్రము కుదిరిన పనికత్తెకంటె నీచముగను జూచుట మిక్కి లి శోచనీయము. భర్తయుఁ పెద్దవారలయు నిట్టి నీచగుణము కోడంద్ర కొండంత యాశకుఁ బ్రీతికిఁ బిడుగువంటి దగును. ఇట్టిదో నట్టి భార్యవలన భర్తకుఁ బరిపూర్ణానంద మెట్లు గలుగును? సత్సంతాన మెట్లుదయించును ? కావున భార్యా విషయమున భర్తయు వాని యింటివారును బరుషత్వము వహింపరాదు. పరుషత్వము క్రూరమృగలక్షణమే కాని పురుషత్వలక్షణము గాదు. మనుష్యలక్షణమును గాదు. అల్ప స్వల్ప దోషములకు నీచపుఁ దిట్టులు తిట్టుట కొట్టుట కేవల నింద్యము. ఇటుండఁ బడుకటింటిలో భార్యతొడపై లావు సూదులుఁ గాల్చిపెట్టు మగలను. భార్యను మూటవలె నెత్తి గోడకు విసరికొట్టు పురుషులను నేమనవలయును? ఇన్ని బాధలు పడియు స్త్రీలు భర్తలపై ననురాగము పాయరు. అదే చిత్రము. సోమరితనముచే భార్య పలుమాఱు తప్పులు చేయుచుండెనేని కోపింపవచ్చును. కోపించి వెంటనే దానిని చుట్టి చుట్టితిరిగి బతిమాలుకొనరాదు అట్లైన నీ బవిసాఱిపోవును. నీ తలపై నెక్కి యది మిరియాలు నూఱును. నీకుఁ గోపము వచ్చునేమో యను భయముండినఁ జాలును. ఇది జఘువ్య పక్షము. కావున సామమార్గము బొత్తిగ నిష్ప్రయోజనమని తోఁచిననే యా యార్గ మవలంబింప వలయును. భయమునకు ప్రేమకు మైత్రిలేదు. ఇంతయేల భర్త వివేకముగల మనుష్యునివలెఁ బ్రవర్తింపవలయును గాని పసరమువలె వర్తింప రాదు. అన్ని కార్యములకుఁ గారణ మెట్లుండవలయునో భార్యా విషయమైన చర్యకుఁ గారణ ముండవలయును. కొందఱు భర్తలు తమ భార్యలను లంజలని ముండలని విధవలని లంజముండలని తిట్టుచుందురు. వీరి నోటివాయువు అపాన వాయువువలె నిష్ఫలమై సరితాఁకకుండుటచే వీరు బ్రతికిరి గాని లేకున్న తమ తిట్లు తాఁకునేని వీ రేనాఁడో తమ శాపోక్తులచేతనే మట్టిపాలయి యుండవలెను. ఆహా వీరినోట వీరే మన్ను కొట్టుకొనఁ దలఁచెదరే యేమి వీరి వివేకము !!

5. కొందఱు భర్తలును అత్తలును కోడండ్రు చక్కని వారు గారని నిందింతురు. తెలివితక్కువ తన మెంత నికృష్టదశవఱకు వ్యాపించినదో చూడుము. నీకు దొప్ప చెవులు మిట్ట నొసలు మిడిగ్రుడ్లు చప్పిడి ముక్కు మిట్టపండ్లు అని కోడలిని నిందించువారి నేమన వలయునో వారెట్టి విపరీత జంతువులో నాకుఁ దెలియదు. ఇవియన్నియు పుట్టువుతోనే వచ్చినవిగావా ? పెండ్లికిముం దీ యత్తగారే యా మగఁడే చూడలేదా? అప్పుడు వీరికిఁ గన్నులుపోయి యుండెనా ? కులకన్యక యందిట్టిది పెద్ద లోపమేని చక్క నిదానినే యేల పెండ్లి యాడరాదు? ఆ పిల్లవచ్చి యీ మన్మథుఁడే తనకు మగడుఁ గావలయునని కోరెనా ? మగఁడు తా నెంత యందగాఁడో తనయందెన్నిలోపము లున్నవో యేల యాలోచింపఁడో, తెలివియుండినఁగదా యాలోచించుటకు, ఈ మాటవలన నెదుటివారి మనస్సు నొవ్వఁజేయుట తప్ప మఱి యేఫలమైనఁ గలదా, తనకేదైన రోగము వచ్చి కన్నో కాలో చేయి యో పోయిన నప్పు డది దెప్పవచ్చునుగదా ? కురుపుల చేతనో స్ఫోటకపు మచ్చలచేతనో ముఖము దేహము వికారమైన నది హేయపడవచ్చును గదా. అట్లది చేసినఁ దనకు నెట్లుండును ?

నేను మగవాఁడను ఎట్లునడచిన నేమి యని దురభ్యాసములకు దుశ్చేష్టలకుఁ బాటుపడితివా వివేకముగల స్త్రీ నీకు భార్య యైనంతమాత్రమున నిన్ను గొప్పగాఁ దలంచునని యెంచితివా నీవే యాత్మవంచకుఁడవు. భార్యయు మనుష్య జాతిలోఁ జేరినదనియు దానికిని మంచి చెడ్డ తాఁకు తప్పు తెలిసికొను వివేకము కలదనియు నెంచుము. కావున దాని యెదుటఁ దెలివితక్కు వ చేష్టలు చేసి గౌరవము పోఁగొట్టుకొనకుము. నీవు గొప్ప గుణములు కలవాఁడవు. గౌరవము మీఁదను సత్కా ర్యములయందును దృష్టిగలవాఁడవు. నలువురిలో పరువుపోవు కార్యములు చేయవు. పాపభీతి పుణ్యాసక్తి కలవాఁడవు అని దాని మనస్సున నాటెనా నీయందు దానికి భక్తి విశ్వాసము లెక్కు వగుటయే గాక యదియు నీగుణముల వంటి గుణములే యభ్యాసపఱుచుకొని నీకు సహకారిణిగా నుండును. ఒక వేళ నీభార్య నీయందలి భక్త్యతిశయముచే నీవు చేయునవి సరియని తలఁచెనా నీవలెనే యదియుఁ జేయఁ బ్రారంభించెనా దాని వక్రమార్గమునకు మార్గదర్శిని నీవే యగుదువు. నీ గుణము సరిగా లేదేని నీ భార్య తెలిసి చేసినను దెలియక చేసినను దాని నాక్షేపింప నోరేది ?

6. తప్పుచేసినపుడు దండించుట యందే యాలోచనము శాంతిగుణము కావలసియుండఁగా నింక లేని దోషములను గల్పింపరాదని నేను జెప్పవలయునా ? అత్తవలన దొంగతనము మగనివలన ఱంకుతనము క్రొత్తకోడలు నేర్చుకొనునని సామెత కలదు. కొందఱు నిష్కా రణముగ లేని దోషములను గోడండ్రయం దారోపించి తిట్టుదురు. పై పడి కొట్టుదురు. చేయనిపని చేసినట్టు చెప్పుదురు. చేసిన మంచిపని చేయలేదందురు. మెప్పులు లేవు. దెప్పులు తప్పవు. నట్టింటఁ దాము సోమరులై పోసిన వస్తు వెత్తిపెట్టిన నది యమ్ముకొనుటకై దాఁచినదందురు. ఎత్తియుంచకున్నఁ దిట్టుదురు. ఈ విధముగ లేనివి పోనివి కల్పించి చెప్పుటచేతను చీటికి మాటికి దండించుట చేతను ఏటుమాటలు పోటుమాటలు తమ్ముఁ దమ దల్లిదండ్రులను నిందించుటచేతను వారిపట్లఁ గోడఁడ్రకు గౌరవబుద్ధి పోయి లక్ష్యములేక భయము విడిచి తిట్టినఁ దిట్టనీ లే యని తలంచుటయేగాక యకార్యము చేయనప్పుడే యిన్ని యనిరే యిఁక జేసిన నింతకంటె నెక్కు వ యేమి చేయఁ గలరని వారునేర్పినట్టు చెడుకార్యములు చేయఁ దొలుత నారంభించిన తరువాతఁ దిట్టునకు బదులు దిట్టుదురు. అంతకు ముదిరిన "తిట్టుకొకదెబ్బ తిమ్మారాయఁడు సెలవిచ్చినాఁ" డందురు కావున నత్తలు నాఁడుబిడ్డలు "అత్తా కాలువచ్చుచున్నదే" యను సామెత మఱవరాదు.

7. భార్యలు నట్టింటఁ నిలఁబడి వీథిని బోవువారిని నెవరినైనఁ జూచినను గొంచెము సేపు వాకిట నిలఁబడినను కొందఱు భర్త లెవరినే యట్లా ఱెప్పలార్పక చూచుచున్నావు. కనుగీటినట్లున్నదే, ఱెప్పలెగర వేయుచున్నావే. ఎవనిమీఁదనో కన్ను వేసినట్టున్నదే, ఎవరికొఱకు వాకిటఁ గాచియున్నావని తేరకు దండింతురు. ఈ విధముగ భర్తలే భార్యలకు ఱంకు తనము నేర్పు నాచార్యులగుచున్నారు.

అత్తయు మగఁడును నిట్టి తెలివిమాలిన చేష్టలు చేయుటవలన దాంపత్యసుఖము చెడుటయేగాక చిన్న వాండ్రు వక్రమార్గమునకుఁ బోవుటయుఁ గలుగును. కావునఁ బెద్దవారు మంచిమార్గ ముపదేశించుట చేతను దాము మంచివని చెప్పినవి తా మనుష్ఠించుటచేతను చిన్నవాండ్రను సరియైన మార్గమునకుఁ దీసికొని రావలయును.

కొందఱు మగ వాం డ్రాఁడు వారి నూరక నసగొట్టుచు సొణసొణ లాడుచుందురు. ఇది పడువారికే గాక చూచువారికిఁ జాలకష్టముగా నుండును. వీరి బ్రతుకింతేగదా యని చిన్నవారు సహించి తిరిగినను వారి మనస్సునకుఁ గష్టము తోఁపక మానదు. ఆఁడు వారియందే యిట్టి గుణ మసహ్యమై యుండనిఁక మగ వారియందు

నుండిన నేమి చెప్పవలయును. తాము గృహకృత్యములు చక్క ఁగ విమర్శించుచున్నామని వారి యభిప్రాయమని నే నెఱుఁగుదునుగాని తెలివితో విమర్శించు పద్ధతి యది గాదు.

8. కొందఱు నిరర్థక నామధారులైన భర్తలు స్త్రీల సుఖదుఃఖములపట్ల విముఖులై చరింతురు. ఆఁడువారి సంతోషము తమ సంతోషమువంటిది గాదనియు, నాఁడువారికిఁ గూడ నొక సంతోషమా యనియుఁ దలంచినట్లు ప్రవర్తించువారు గలరు. అదియేమో గొప్పగుణమని నిష్కా ములవలెఁ గొందఱు బిఱ్ఱబిగించుకొని పరిపూర్ణ రాజస మమరినట్లు నటింతురు. కావలయునని యిట్లు సేయువారు చాలఁ గొలఁదిగాని యుపేక్షాపరులు పెక్కు రుగలరు. దుడ్డుదుగ్గాణి వెచ్చించి పనికి మాలిన వస్తువులుకొని యిమ్మని నేను జెప్పను. అట్టి దుర్వ్యయము తెలివిగల యాఁడువారుకూడ నోర్వరు. ఎప్పుడైన నేదైన నుపయోగకరమైన వస్తువును వారై కోరిరేని చేతిలో దమ్మిడి లేదనుకము. మగవారు చేయు దుర్వ్యయములు వారికిఁ దెలియనివిగావు. నీకై పనికిమాలిన వస్తువులెన్ని యైనఁ గొనుచు వారెన్నఁడో యొకనాఁ డేదైన మంచివస్తువు కోరినప్పుడు తీసి యీయకుండిన చూచితివా మన నిర్భాగ్యపు బ్రతుకని వారికిఁ దోచును. అట్టని యెడపాదడపా గాజుపూసలకు మట్టిపూసలకు దండుగు పెట్టెదమనిన నేమియు నీయవలదు. నీవై పూలుగాని పండ్లుగాని తెచ్చి యిచ్చిన వారెంత సంతోషింతురు. ఎందైనఁ బూలో పండ్లో మఱి యే తినుపదార్థమో తమకుఁ దేరకు లభించిన యెడల వానిని దామే యుపయోగింపక కొంచము బార్యకేల తెచ్చి యియ్యరాదు? నోటిమాటలకుఁ గఱవా? నవ్వుచు మాటలాడరాదా ? నవ్వింపరాదా ? ఇట్టి కార్యములచే స్త్రీల నెంతో సంతోషపెట్టవచ్చును. మగఁడింటికి వచ్చువేళ యయ్యెనేయని భార్య భయపడునట్లుండ రాదు. మగఁడు వచ్చు వేళ యయినది కదా యని ప్రీతితో నెదురు చూచునట్లుండ వలెను. ఇది పురుషుని నడవడి పట్టి యుండును.

సుఖములు కలిగింపకుండిన దుఃఖము లేదుగాని భార్యలకు రోగములు వచ్చినపుడు మగలు శక్తి గలిగియు వారికి మందు లిప్పించి తగురీతి నుపచరింపకుండుట గొప్పదోషము. ఇట్టివారిని గొందఱ నే నెఱుఁగ నేని యీ విషయమై నేను వ్రాసియే యుండను. ఇట్టివారుకూడా లోకమునఁగలరాయని సందేహింపఁదగిన విషయము. తమకై భార్యలు రేయుంబవలు కన్న కష్టములు ననుభవించుచుఁ దమ సుఖదుఃఖములే వారి సుఖ దుఃఖములుగా నెంచుచుఁ దమకు సర్వకాల సర్వావస్థలనుపచరించి యుపకరించుచుండ వారికిఁ గష్టము వచ్చినపుడు తెలిసియుఁ దెలియనివారివలె నటించుటగాని ధనలోభముచే చికిత్స నుపేక్షించుటగాని పరమ నీచతమము. కృతఘ్నతకుఁ బరకాష్ఠ. తమ దేహములవంటివే వారి దేహములనియు, తమ బాధలంటివే వారి బాధలనియు నా పురుషపశువుల కేలతోఁపదో. ఆహా లోభమెంత దోషకారి ! దీనివలన నాఁడు వారికి సంసారమందును భర్తల యందును రోతపుట్టుట వింతా ? పుట్టకుండుట వింతా ? ఇట్టి భర్తలు తండ్రులు నా కన్నులలో మెదలుచున్నారు. అన్యుఁడనైన నాకే యిట్టి వారియందు సదభిప్రాయము లేదన నిఁక వీరి లోభముచే దుఃఖించువారి కెట్లుండఁ గలదు? చికిత్స చేయించెడి వారికంటె వీరు వగలమాటలు ఓదార్పులు సాకులు నెక్కు వ చెప్పుచుందురు. ఆ మాటలనే యెదుటివారు నమ్ముదురని వీరి తలంపు. శక్తి హీనులయెడ దోషము లేదు. కానివారె నను నింత గచ్చాకో పుచ్చాకో తెచ్చి యిచ్చుచుండిన రోగులకు నంతుష్టియుండును. కష్టములందుఁదమ్ముభర్తలు శక్తి వంచన చేసి యుపేక్షించిరనితలఁపరు. కష్టము వచ్చినపుడు భార్య కెట్టి యుపచారమైనఁ జేయవలసినదే. రోగులకు ఉప చరించుటయందు నీచకార్యమనునది లేదు. శక్తికొలఁది యెంతైన వ్యయపఱుప వలసినదే. బ్రతుకునని యాశ లేనపుడుగూడఁ జికిత్స చేయించుట మానరాదు. ఇది సర్వప్రాణి సామాన్యమైన విధియయి యుండ భార్యల బిడ్డల విషయమై చెప్పఁబనియేలేదు. భార్య కుపకరించుట సిగ్గుమాలిన కార్యమని భార్యా దాసత్య చిహ్నమని యుదారబుద్ధి, భూతదయ, మనుష్యస్వభావజ్ఞానము, కృతజ్ఞత గలవారు తలంపరు. పెండ్లమునకు బిడ్డలకు నుపకరింపని వీరు పరులకేమి యుపకరింతురు ? పరోపకారబుద్ధి లేనివారు తరించు మార్గమేమి ? కావున నిట్టి సమయము వచ్చినపుడు లోభమునకు దురభిమానమునకు లోబడి పురుషులు పాపమూర్తులు కారాదు. పురుషుల తెలివి తక్కు వతనము తెలుపునది యింతకంటెను గొప్పది మఱియొకటి గలదు. బ్రతికినంతకాలము తన కెన్నియో విధముల సేవచేయుచుఁ దనకు సుఖమొనగూర్చుచుఁ దన వంశమును గూడ నిల్పిన భార్యమరణించినపుడు ఆమెయుత్తర క్రియలు తానుగూటమువలె నుండియుఁ జేయక కూలిపెట్టి చేయింతురు. కొందఱకది హీన కార్యమని యుపేక్షాభావము. మఱికొందఱు దుఃఖమని నెపము చెప్పి పదిదినములలోనే లంజలయిండ్లకుఁ బోదురు. ఇట్టి వారిని గొందఱ నేను బ్రత్యక్షముగఁ జూచియున్నారు. ప్రాణము పోవునట్టి దశయందుండినఁ దప్ప నీ కార్యము

భర్త చేతులారఁ జేయవలయును. లోకములోఁ బురుషుల దుండగ మెంతవఱకుఁ బోవునో తెలుపుటకై యిది వ్రాసితిని. నే నిట్లు భార్యకు బ్రియుఁడనై మెలఁగుమని చెప్పుటచే భార్యా దాసుఁడవై మెలగుమని చెప్పితినని గ్రహింపఁ బోకుము. నీవు పురుషుఁడ వైనచోఁ బరుషగుణములు గలిగియుండుమని చెప్పిన వాఁడఁగాను, పరుషత్వము పౌరుషమని తలఁపఁబోకుము. శత్రువులందును దయగలిగి ప్రవర్తించుటే పురుషలక్షణము. దయ – దాక్షిణ్యము – గాంభీర్యము – ఔదార్యము లోనైన సద్గుణములు పురుషలక్షణములుగాని తద్విరుద్ధగుణములు పురుషగుణములు కావు. ఒకనిని కాలుసేతులు బిగియఁగట్టి పడవైచి పిమ్మట శూలములతోఁ జొడుచుట పౌరుష లక్షణమా అట్టులే బదులేమియుఁ జేయఁజాలదుగదా యను ధైర్యముతో భార్యలఁ దిట్టుట కొట్టుట యుపేక్షించుట లోనైనవి పిఱికి లక్షణములుగాని పౌరుషలక్షణములు గావు.

చనవిచ్చితే నాలు చంకకెక్కు ననుటయుఁ జంక కెక్కి న పిమ్మటఁ దలపై నెక్కు వనియుఁ బిమ్మటఁ గ్రిందఁ ద్రోయుట కష్టసాధ్యమనియు నే నెఱుంగనివాఁడఁగాను. చనవనఁగా మంచిమాట లాడుట సుఖదుఃఖములు విచారించుట ప్రీతికలిగి వర్తించుట గాదు సుమీ ! దానికి సంబంధము లేని కార్యములందు దానికిఁ బెత్తనము కల్పించి నీ యధికారము దానికిచ్చి కామాతిరేకముచేతనో ముఖప్రీతితోనో యుపేక్ష చేతనో సోమరితనముచేతనో దాని వక్రమార్గము వక్రబుద్ధి నీ కిష్టము లేకున్నను దాని యిష్టప్రకారము వర్తించి యెవ రే మడిగినను బెండ్లాము నడిగి చెప్పెదనని చెప్పుచు, నది భర్త గాను నీవు భార్యగాను వర్తించుట చనవిచ్చుట యనుమాట కర్థమని గ్రహింపుము. ఇట్టివాని మాటయందు నెవ్వరికి నమ్మకములేదు. ముందు మించి సభలో నొక కార్యము చేసెదనని చెప్పెనా భార్య యుత్తర వగువఱ కా కార్యము వాఁడు చేయునని యెవఁడును నమ్మఁడు. ఒక రూక నొకని కిచ్చెదనని చెప్పి మాట దక్కి ంచుకొనలేఁడు. ఇట్టిదానికే రవికల ప్రభుత్వమని పేరు. ఇట్టి చనవిచ్చుటచే దుఃఖపడిన వారనే కులుగలరు. ఒకసారి యిట్టి చనవిచ్చినయెడల భర్త తనకు దాసుఁడయ్యెనని యెంచి తనకు సంబంధ మున్నదానియందును లేని దానియందును గూడా సంబంధము కల్పించుకొని తాను జెప్పునదే సరియని తన యిష్టప్రకారము భర్త ప్రవర్తింపవలయునని బలవంతపెట్టఁ దొడఁగును. ఇది భర్తకు మానహానికరము. అపాయకరము వాదియొద్దనో ప్రతివాదియొద్దనో భార్యలు లంచముతీసికొని యతనికనుకూలముగ దీర్పుచెప్పుఁడని డిప్టికలెక్టర్లు గానుండు భర్తలను బలవంతపెట్టిన యిల్లాండ్ర నేనెఱుఁగుదును. దానివలన ఆ భర్తల కవమానము కలిగెనని నేను జెప్పవలయునా ? కావున వ్యవహారవిషయములు వెలుపలఁ బోరాని రహస్యవిషయములు స్త్రీలకుఁ జెప్ప రాదు. భర్త గుణవంతుఁ డగుటచేతఁ దనయందుఁ బ్రీతికలిగి యున్నాఁడని భార్యలకు మనస్సునఁ దగులవలయును గాని పెద్దమ్మ పుత్రుడు అసమర్థుఁడు "విధవ నాగన్న" యగుటచేఁ దనకు బానిసగా నున్నాఁడను నభిప్రాయము దానికిఁ గలిగింపరాదు.

## భార్యవిషయమున భర్తకుఁ గర్తవ్యములు

ఇంతవఱకు నీవు భార్యయెడలఁ జేయరాని కార్యములఁ జెప్పితిని. చేయవలసినవి కొన్ని చెప్పెదను. భార్య దుఃఖించుచుండఁ దాను సుఖింపగలనని తలఁచువాడు సాధు వర్తనుఁ డాయెనా వెఱ్ఱివాఁడు. దుష్టవర్తనము కలవాఁడాయెనా పరమద్రోహి ఈ పాతకుని మనము స్మరింపఁ బనిలేదుగాని సాధువర్తనుని విషయ మాలోచింతము. ఒక బండికి రెండెద్దులు కట్టియుండ నందొకయెద్దు ఈడిగలఁ బడిన రెండవయెద్దునకు సుఖముకలదా ? ఇరువు రొక కార్యము చేయఁబూనినపుడు వారిలో నొకఁ డీలుపడిన వాని భారమునుగూడ రెండవవాఁడు మోయవలసి వచ్చునుగదా ధనార్జనాది కార్యములకై వెలి తిరుగువాఁడు భర్త. గృహభారము వహించునది భార్య. ఇరువురు కార్యములు చేయ సామర్థ్యము కలిగియుండిననే సంసారశకటము సాగును. స్త్రీ లిండ్లలో నున్నంత మాత్రమున సుఖముగఁ గూర్చున్నవారిని తలఁచువారు తెలిసినవారుకారు. సామాన్యమైన గృహమందును బనిమీఁదఁ దిరుగు నిల్లాలు దినమున కథమపక్షము 7–8 మైళ్ళకుఁ దక్కు వ తిరుగదు. గుడగుడ గుంటములాడి నట్టుల కొంచెము ప్రదేశములోఁ దిరుగుటచే దూరమింత యని తెలియరాదు. ఇఁక తక్కి న పనులన్నియుఁ జేయుటకు నెంతశ్రమము పడవలయునో యాలోచింపుము.

పురుషులతో సమానముగనో వారికంటె నెక్కు వగనో స్త్రీలును గష్టించుచున్నారుగాని తక్కు వ కష్టము చేయుటలేదు. అట్టి సందర్భములో భర్త తా నెట్టి సుఖము సంతోషము గోరునో భార్యకు నట్టి సుఖసంతోష ములలో సగమైనఁ గలిగింపకుండుట బాగా ? పురుషు లనుభవించు నంతభోగము సుఖము ననుభవింపఁ గులకాంత కవకాశమే దొరకదు. పోరానిచోట్లకును. మగవారి సభలకును. రచ్చలకును దమ్ము బిలుచుకొని పొమ్మని

మగనాం(డ్రు భర్తలను గోరరు కావునఁ గులస్త్రీలు పొందగిన చోటుల నేవైన వినోదము లుండిన నెప్పుడైన మగవా రాఁడువారిని బిలుచుకొని పోవలయును. తా మేమైన వింతలు వినోదములు చూచినను జదివినను వినినను ఆఁడువారికిఁ జెప్పవలయును. లోకజ్ఞాన మాఁడువారికి నుండుట యావశ్యకము. కుటుంబభారమున విసుఁగు పుట్టకుండునట్లు చేతనైనంత యుత్సాహము నుల్లాసము వారికిఁ గలిగించుచుండుట మగవారికి నిధి అన్నిటికి నారోగ్యము మూలము. కావున వారు తమ యారోగ్యమును గాపాడుకొనునట్లు చేయుట మిక్కిలి ముఖ్యకార్యము. మగవారు తమ యారోగ్యమును గాపాడుకొనుట యెంతముఖ్యమో యాఁడువారి యారోగ్యమును గాపాడుటయు నంతముఖ్యము, స్త్రీ లారోగ్యవతులు గారేని పురుషు లేవిషయమున సుఖపడఁగలరు. భార్యయనఁగా భర్తయెడమ సగమని చెప్పితిని గదా. ఇది యలంకారార్థము చెప్పినవాక్యముగాదు. ఎడమ యండములోని వీర్యము స్త్రీల యెడమ యండకములో (బ్రవేశించిన స్త్రీశిశువే పుట్టునను గామశాస్త్రజ్ఞుల వాక్యము స్మరిచితివేని భార్య వామ భాగమనుట పరమార్థమని యెఱుంగగలవు. అట్లైనచో నీ యెడమ దేహము సగము బాధపడునపుడు కుడి సగ మెట్టు సుఖింపఁగలదు ! ఇది మనస్సున నుంచుకొంటివేని భార్యావిషయమున నెట్లు ప్రవర్తింపవలయునో నీకే తోఁచును. భార్యల యారోగ్యము బలము సర్వవిధముల భర్తలు కాపాడవలయును. కావున బాలక హితచర్యయందును గుమార హిత చర్యయందును జెప్పిన యారోగ్య పద్ధతులను వారనుసరింపఁ జేయవలయును. ఆహార నిద్రావిహారంబులందే కాకవారు దేహపరిశ్రమ యందుఁగూడ శ్రద్ధాళులై యుండునట్లు భర్తలు కనిపెట్టవలయును. వారి సమాచారము వారికిఁ జెప్పక మాకుఁ జెప్పెదవేల యందువేమో. వారికిఁ దానివలన లాభము ప్రయోజనము తెలియమిని నుపేక్షింతురు. బాగున్నారము కదా యిప్పుడు మాకేల పరిశ్రమ మందురు. మేము చేయుకష్టము చాలదా యీ కష్టముకూడనా యందురు. కొంద ఱదరిపడి యాఁడువారికఁట ! దేహపరిశ్రమమఁట ! ! ఏమి వింతకాల ! ! ! మందురు. ఈ యాక్షేపముల కన్నిటికి భర్తలు తగిన సమాధానము చెప్పవలయును. వాస్తవార్థము తెలియక పోవుటచే వారి కీ సందేహములు గలుగును. స్త్రీల కాలుసేతులకుఁ గావలసినంత పరిశ్రమము కలదుకాని శ్వాసకోశములకు నుదరమునకు బలమిచ్చునట్టి పరిశ్రమము వారికి బొత్తిగలేదు. ఈ కారణముచేతను జిన్నప్పుడు పావడలు చీరలు నడుములు వాఁతలుపడి కాయలు కాచునట్లు బిఱ్ఱుగ బిగించుట చేతను. స్త్రీలకు సాధారణముగా నుదర సంబంధమైన వ్యాధు లనఁగా ముట్టుకుట్టు ప్రదరము కడుపునొప్పులు మొదలైనవి కలుగుచుండును. స్త్రీలకు, గంతము దిగువ తొడల కెగువనుండు ప్రదేశమునకు సంబంధించిన వ్యాధులే తఱచు గాననగును. ఈ భాగములకును సరియైన పద్ధతి వ్యాయామము కలిగించిన నీ వ్యాధులు కలుగవు. ఈ రోగముల నిదివఱకే కలవారును వాని వలన విముక్తులై సుఖింతురు. మఱియును స్త్రీలు తా మందగత్తెలుగా నుండవలయునని కోరు చుందురు గదా? తన భార్య యందగత్తెగా నుండ వలయునని కోరనిభర్తయెవఁడు ? అట్లైనచో నందమన నేమి? ఎఱ్ఱతోలుండుట మాత్రమే యందమా ? కాదు. గాదె బుట్టలవలె నేకరూపముగ బలిసియుండుట యందమా? కాదు. పీర్ల పండుగలోని వేషమువలె ముఖమున బూడిదకొట్టుకొనుట యందమా ? కాదు. తిరుగలి పిఱుఁదులు సొఱకాయతొమ్ములు అందమా ? గాదు. ఆభరణములు వస్త్రములు నందమును సృష్టింపవు. పరిమాణ ప్రకారము సర్వాంగములు పరిపూర్తి నొందియుండుటే యందము. చక్కఁదనమను శబ్దమునకు నందమని యెట్లర్థమయ్యెను? అన్ని యవయవములు పరిమాణ ప్రకారము చక్కఁగానుండుటె చక్కఁదనము. అందమైన దేహపరిపుష్టి పరిశ్రమము వలననే కలుగును. పరిశ్రమము లేని యంగములందుఁ గ్రొవ్వు పేరుకొనును. అధికశ్రమము గల యంగములు శుష్కించియుండును. క్రమమెఱిఁగి చేసెడి పరిశ్రమమువలన నిట్టి లోపములన్నియు నివారింపఁబడి ప్రత్యవయవ మును మితస్థితిలో నుంచుటగును, ఈ మితస్థితియే యందము. ఈ కారణముచేతను భార్యలు పరిశ్రమము చేయునట్లు కనిపెట్టవలయును. అందమునకుఁ దలవెండ్రుకలు ముఖ్యములు.

అవి యారోగ్యవతులకుఁ గలుగునా ? రోగగ్రస్తలకుఁ గలుగునా ?

దేహ పరిశ్రమమువలననే బలము కలుగును. గృహ కృత్యములకు బలము కావలసినమాట యటుండ భార్య బలముకలది కాదయ్యేనేని పురుషుఁడెట్టు దానితో భోగించి సుఖపడఁ గలఁడు ? భార్య బలహీను రాలయ్యెనేని పురుషునకు భోగమైనది స్త్రీకి రోగమగును కావునఁ నేదో నెపము పెట్టి వానితోఁ గలయక యుండుటకే యది యత్నించును. కావునఁ బురుషులు తాము దేహపరిశ్రమము గావించుటతో సంతుష్టిపడక భార్యచేతఁగూడఁ బ్రతిదినము చేయింపవలయును. ఇరువురు బలముగలవారై యుండిన యిరువుర కానందము గలుగును. ఆరోగ్యము బలముగల బిడ్డలు పుట్టుదురు. మందుల వ్యయము తగ్గును. బాలింతరాం(డ్రు వేదనలేక ప్రసవింతురు. ఉత్సాహము

ధైర్యము చెడవు. 7, 8 వ నెలలందలి కాన్పులు తగ్గును. పుట్టినబిడ్డలు బ్రతుకుదరు. బ్రతికినబిడ్డలు గుమ్మడి పండ్లవలె నుందురు. వెంపలిచెట్లకు దోట్లువేయువారు పుట్టరు. ఇన్ని మంచిగుణములు కలదానిని వదలవచ్చునా?

భార్యకు భర్తలారోగ్యశాస్త్రము శరీరశాస్త్రము వీనిలోని విషయములు బోధింపవలయును. దేహపారిశుద్ధ్యము – వస్త్రపారిశుద్ధ్యము – పాత్రపారిశుద్ధ్యము – పదార్థ పారిశుద్ధ్యములకు గురించియు మితవ్యయమార్గము లోనైనవియు నేర్పవలయును.

నీవు మగవాఁడవు. ఎక్కు వ చదివిన వాఁడవు. ఎక్కు వ జ్ఞానము లోకానుభవము గలవాఁడవు. మంచిచెడ్డ తెలిసిన వాఁడవు కావున నీవు నీభార్యకు కులోచితమువంశోచితమునైన నీతి మతాచారములగుఱించి రాత్రియందో పగటియందో కథలుగానో మఱి యేవిధముగానో చెప్పుట విధి. నీవే నీ భార్యకుఁ దెలియఁజెప్పవేని మఱియెవ్వరు చెప్పుదురు? పరులు మంచి చెప్పుదురో చెడ్డ చెప్పుదురో నీ కెట్లు తెలియును ? భగవద్గీతాద్యుపన్యాసకులగు కొందఱు పండితుల నడవడులు నీ వెఱుఁగవా ? ఇంద్రియము లింద్రియార్థములందు వర్తించును. కాఁబట్టి కార్యములకుఁ గర్తలు మనము కామని భగవద్గీతావాక్యముల నుపదేశించి వినవచ్చిన శిష్యురాండ్రను భార్యలుగాఁ జేసికొనిన యోగుల వృత్తాంత మెఱుఁగవా ? కావున సద్విషయములను భార్యలకు భర్తలు బోధించుటె శ్రేష్ఠము. దీనివలన భర్తలకును మేలు కలదు. కోడలికి బుద్ధి చెప్పి యత్త లంకుపోయినట్టు భార్యలకు సదాచారముపదేశించి తాము దురాచారముల పాలు కారాదు. స్త్రీలకు జ్ఞానముపదేశించుట యన్నిటికంటెను శ్రేష్ఠమైన వార్యము.

## సంభోగ విషయము

నాయనా ! యింతవఱకు నీకు సంసారవృక్షమున నాకులు కొమ్మలు రెమ్మలను గుఱించి చెప్పితిని. కాలి పూలు పండ్లను గుఱించి చెప్పినవాఁడఁగాను. ఇఁకఁ జెప్పదను. గృహిణి లేనివాఁడు గృహస్థుఁడు కాఁడనియు గృహస్థ ధర్మము నిర్వహించుట భగవత్ప్రాప్తికనియు బ్రహ్మచర్యము – గార్హ స్థ్యము రెండును భగవత్ప్రాప్తికి మార్గములైనను గార్హ స్థ్యము సుఖమైన క్రమమార్గమనియుఁ జెప్పితిని. దారసంగ్రహంబు ధరణీశ ! రతిపుత్రఫలము అని శాస్త్రము. భార్యను గ్రహించుటకు ఫలము రతియును సుతులును. రతి లేక సుతులుగలుగరు. కావున దానిని గూర్చి తొలుతఁ జెప్పెదను. అది యేమి విపరీతబుద్ధియో నే నెఱుఁగఁగాని రతి రతికేళి సురతము అను పదములు నోట నుచ్చరింపరానివనియు విన నపవిత్రశబ్దములని వానిని వ్రాసినవారిని కఠినశిక్షల పాలుచేయవలయునని కొందఱు దేవురులాడుచున్నారు. సందేహింపఁదగిన నడవడికల వారే నిప్పునిన నోరు కాలు నందురు. కొందఱు పరమపవిత్ర వేషధారులు. నాయనా ! మతిలోపముచే నేదిపరమపవిత్రమో యది యపవిత్రమని కొందఱకుఁ దోచుచున్నది.

రతి విషయము గోప్యమని వెలిగా నుచ్చరింపరాదని చెప్పుటకు నది పరమపవిత్ర మగుటయే కారణము. మనము పూజచేయు దేవతా విగ్రహములను నట్టింట నుంచెదమా ? ఎవరు మైలతోఁ దాఁకరాని రహస్యస్థలమున నుంచెదమా ? మైలవస్త్రములతో దేవపూజాగృహములలోనికైనఁబోదుమా? పూజాపాత్రము లెంత పవిత్రములుగ భావింతుము. భగవద్విషయము నీచముగా మాటలాడు నీచుఁడుగలఁడా. రతి విషయము పవిత్రమైన దన దానికి సంబంధించిన యంగములు పవిత్రములైనవి. ఇట్లు పవిత్రములగుటచే గోప్యముగా నుంచఁ బడిన వానినపవిత్రములు గావున వానిని దలఁపరాదని యుచ్చరింపరాదని చెప్పుటకంటెఁ దెలివిమాలిన చేష్ట యేది గలదు? మర్మాంగములను వస్త్రము చాటున నుంచుట వానిని దక్కి న యవయవములవలెఁ బలుమాఱు తాఁకరాదని దృష్టికిని గోచరింపఁ జేయరాదనియే గాని యవి నీచాతినీచములై గర్హ్యములగుటచేఁ గాదు. అమూల్యపదార్థము నట్టింటఁబెట్టి పలుమాఱు తాఁకుదువా? భగవంతుని యుద్దేశ మిదియే యని యీ యంగములను గప్పునటుల పశువులకుఁ దోఁకలు, పక్షులకు వెండ్రుకలు, విత్తనములకు దొడిమిలపై నుండు తేకులు భగవంతుఁడు సృష్టించుటచేఁ దెలియనగును.

అందు పురుషాంగములకంటెను స్త్రీల యంగములు మిగుల గోప్యములుగ దాఁపఁబడినవి. కావుననే పురుషులకంటె స్త్రీల కెక్కు వ లజ్జ. ఆ కారణముచేతనే యీ యంగములు వారికిఁ గడుపులో నుంచఁబడినవి గోఁచి పెట్టుకొని పురుషుఁడు తిరుగును గాని స్త్రీ తిరుగునా? కావుననే లజ్జ విడిచిన స్త్రీ స్త్రీ గాదని యెంతురు. గార్హ స్థ్యము భగవత్ప్రాప్తికి సోపానమైనచో నది నీచమెట్టు లగును ? వీనియందు గొప్ప యభిప్రాయము లేక

నీచమని తలఁచువాఁడు నీచుఁడుగాని యంగములు నీచములేనాఁడును గావు. అవినీచములయ్యేనేని వానివలన బుట్టి వానియందుఁ బెరిగినవాఁడు తానెంత నీచుండుఁగా నుండవలయును. అమేధ్యమున సువాసన పుట్టునా? తాను బవిత్రుఁడగునేని తన జననకారణములయిన యవి యెట్లపవిత్రములు? పూజింపవలసిన పదార్థములను దుష్టమార్గముల నుపయోగించుటచే నవి యపవిత్రము లగునుగాని స్వభావమున నవి యపవిత్రములు గావు. చీరకట్టుట సిగ్గునకా సింగారమునకా యను సామెతయర్థము నిపుడు గ్రహింపుము. సిగ్గునకేగాని సింగారమునకుఁ గాదు, సిగ్గువిడిచిన స్త్రీ చీరకట్టుకొన్నను కట్టుకొనకున్నను భేదము లేదు. సిగ్గువిడిచినది చీరవిడచినదే కావున మర్మాంగములు గౌరవార్హ ములగుట గోప్యములని తలంపుము. నీచములని తలంపకుము. అట్లు తలంచువాఁడే నీఁచుడు అట్టి నీచుఁడే నీచకార్యములకుఁ బాలుపడును. పవిత్ర భావన గలిగెనేని పవిత్రములుగానే యుపయోగించును. పవిత్రఫలములే లభించును. ఈ విషయము తెలియనివారు వానిని బవిత్రమార్గమున నుపయోగించువిధము తెలియక యిచ్చ వచ్చినట్లు ప్రవర్తించి సంసారసుఖము నాశనముచేసికొని యనేక కష్టములకుఁ బాలుపడుచున్నారు. పవిత్రమని భగవంతుఁ డుద్దేశించిన దానిని పవిత్రమని యెంచక యపవిత్రమార్గముల నుపయోగించువారికి దుఃఖశిక్షగాక సుఖరక్ష యెట్లువచ్చును ? వివాహ గర్భాధానములందుఁ జెప్పఁబడు మంత్రముల యర్థము నీ వెఱింగితివేని గర్భాధాన కర్మమున స్త్రీ పురుషులు ప్రవర్తింపవలసిన శాస్త్రీయమార్గమును దెలిసికొంటివేని సంతానాభివృద్ధికై చేయు నీకార్యము పరమపవిత్రమని గ్రహింపఁగలవు.

గర్భాధాన ప్రథమదినమే స్త్రీ పురుషుల సుఖానుభవోత్సవమునకు నంకురార్పణ దినము. మనవారి యిప్పటి కొందఱ తెలివి యెక్క డికిఁ దెల్లవాఱినదో యొక విషయము నాలోచించినఁ దెలిసికొనఁగలవు. గర్భాధానము సిగ్గుమాలిన నీచ కార్యము కావున నానాఁడు మంగళవాద్యములు వాయించుట తమ సిగ్గుమాలిన చేష్టను లోకమునఁ బ్రకటించుటే కదా, కావున మంగళవాద్యము లక్క ఱలేదందురు ? ఓరి సిగ్గుమాలిన వారలారా ? యంతటి సిగ్గుమాలిన కార్యమును చేయు మీ రెంత నీచులరో కదా ? తాము గొప్పవార మనుకొను వారు తెలిసి తెలిసి నీచ కార్యమున కొడిగట్టవచ్చునా? వారి నడుగువాఁడు లేఁడు. కొందఱీ ప్రకటనకు వ్యావహారిక లాభములు చెప్పుదురుగాని యది గౌణపక్షము. గర్భాధానము శుభకార్యము. వంశప్రతిష్ఠానకకార్యము, జీవకరణ కళేబర ప్రధాన కార్యము? ఇహపరలోక సాధకకార్యము. ఆనందము చేతను నుల్లాసముచేతను నుత్సాహముచేతను నిండియుండ వలసిన సమయము కావున మంగళవాద్యములు భోజన ప్రదానాదులు నింద్యములు గావు. వీనికై చేయు వ్యయము దుర్వ్యయము గాదు. అవశ్యము చేయఁ దగినవనియే నా పరిపూర్ణాభిప్రాయము. ఈ దినము మొదలు నీవు చందనము, పరిమళపదార్థములు, పుష్పములు, తాంబూలము మొదలైన వానికర్హుఁడనగుదువు వీనియన్నిటివలన మేలుగలదనినమ్ముము. తెలివి లేనివాని మాట నమ్మి వీనిని విడనాడకుము. వీనివలఁ బ్రయోజనము లేదేని బ్రహ్మచర్యమున నివి వలదని చెప్పిన వాఁడను నీవిపుడు సేవింపవలసినదని యేల చెప్పుదును ? ఈ గ్రంథము చదువుకొలఁది వీనివలని లాభములు నీవే తెలిసికొందువు.

సుఖమున కంకురార్పణమైన దినముననే కొందఱు పురుషులు తెలియనితనముచే దుఃఖాంకురార్పణము చేయుదురు. కావున నట్టి ప్రమాదములు జరగకుండుటకై కొంద చెప్ప సాహసించితిని. బుద్ధిగలవారు తెలిసికొని బాగుపడుదురు గాక.

నీవు గర్భాధానకార్య మెట్లుపక్రమింపవలయునో "ఆరోహోరు" మ్మను మంత్రము చెప్పుచున్నది. ఆ మంత్రము చెప్పునపుడు విని యా ప్రకారము చేయుము. అట్లు చేయునపుడు స్త్రీల గర్భద్వార మార్గములోపల నొక పొరయుండును. ఇది కొందఱయం దుండును కొందఱయం దుండదు. కొందఱయం దుండినను రోగాది కారణములచే నశించి యుండును. ఇది బాగుగ నుండెనా యేండ్లు జరగుకొలఁది పెరిఁగి మందమై సులభముగ భేదింపరాకయుండును. ఆ కారణముచే వయస్సువచ్చిన పిమ్మట వివాహములు చేసికొను పాశ్చాత్యకన్యలు గర్భాధానమునకు ముందు వైద్యుని యొద్దకుఁ బోయి పరీక్ష చేయించుకొని ముదిరియుండినయెడల శస్త్రచికిత్స చేయించుకొందురు. మనలో నిదివఱకటి గర్భాధానములు లేవు. కావున ముందుగ వైద్యులు కత్తులతో స్త్రీ మర్మాంగములు లొడఁబెట్టవలసినవి కలుగలేదు. రజస్వలా వివాహము వెంట ఆ కార్యములును వచ్చును. ఇది తొలి దినమున భేధించినపుడు రక్తము విశేషము స్రవించును. గాయమగుటచే స్త్రీలకు నొప్పి కలుగును ఆ బాధచే వారు 2-3 వారముల వఱకుఁగూడ మరల మగనితోఁ గలియుట కంగీకరింపరు. పురుషుఁడు తొలిదినమున మృదువుగఁ బ్రవర్తించిన నీబాధ కొంతవఱకుఁ దగ్గింపవచ్చును. ఈ విధమైన బాధ కలుగకున్నను బ్రథమ సంగమ

మనేక బాలికలకు తొలుత మిగుల బాధాకరముగా నుండి క్రమక్రమముగ 1-2 వారములలో నిమ్మళించును స్త్రీలకుఁ గలిగెడి యీ బాధలు తెలియనివారు రెండవదినము మొదలు భార్యలు విముఖులై వర్తించినయెడల వారియందు దురుద్దేశ మారోపించి కోపింతురు. అది విరసత్వమునకుఁ బ్రారంభదశ. పై విషయము తెలిసినవారు రెండవదినమున వారి కష్టసుఖములు విచారించి వారికి సుఖమగు మార్గముననే ప్రవర్తింతురు. కావున బుద్ధిమంతు లగు భర్తలు భార్యలు భయపడకుండునట్లు మెలఁకువ గలిగి వర్తింపవలయును. తల్లిలేని కన్యకలు సమర్తాడకున్నను ఆడినారని చెప్పి సవతితల్లులు నిషేకముహూర్తము జరిగింతురు. అది మఱి ఘోరము.

మీఁదఁజెప్పిన కారణముచే రక్తము స్రవించినపుడు తెలియనివారు నానా కారణములు చెప్పుదురు వరుని యింటి వారు పెండ్లి కొమార్తెపై దోషము చెప్పుటయుఁ బెండ్లి కొమార్త యింటివారు పెండ్లి కొడుకుపై దోషములు చెప్పుటయు అక్క డ నుండి వృథా కలహములు నిష్ఠురములు.

రక్తము స్రవించునపుడు పఱుపులపైఁ బఱచిన తెల్లని దుప్పట్లు చెడి చూచుటకు భయంకరముగా నుండును. అది యేమని యెవరైన నడిగిన హారతినీళ్లు దొరలినవని చెప్పుదురు కన్య యెఱ్ఱనివస్త్రము ప్రాతఁదైనను గ్రొత్తదైనను పఱచుకొని దానిపై బరుండుట బాగు. ఉత్తదినములందైనను భార్యా భర్తలు కలియుటకు ముందు మైలవస్త్రము క్రిందవేసికొని పరుండి యావలఁ దీసివేయవలయును. దిసమొల స్త్రీలను చూడరాదు. దీపము వెలుతురుండరాదు. ఒక రాత్రి యొక మాటునకు మించి భార్యాభర్తలు కలియరాదు. వారమునకు రెండుమార్లు కెక్కు వగఁ గలియుటవలన నారోగ్యమునకు హాని ధాతువు క్షయించును. గ్రీష్మఋతువునందుఁ బక్షమున కొకసారియే శాస్త్రము విధించుచున్నది. అన్నము జీర్ణము కాని దశయందుఁ గలియరాదు. కావున మొదటి రెండు జాములఁ గలియుట హానికరము. దినమంతయుఁ గష్టపడుట, అజీర్ణభుక్తి, భోజనానంతరము సంగమించుట, అతిసంగమము నివి భార్యాభర్తల ననేక రోగముల పాలుచేయును. అంగ వైకల్యము, బుద్ధివైకల్యము గల సంతానమునకుఁ గారణములగును. నిండు కడుపున నాలోచించుట, చదువుట హానికరమై యుండ సంగమించుట హానికరమని వేఱే చెప్పవలయునా? ఆలోచించునపుడు రక్తమంతయు శిరస్సునకుఁ బ్రవహించును. అన్నము జీర్ణమగునపుడు దుదరమునకుఁ బ్రవహించును. సంగమించునపుడు మర్మాంగములకుఁ బ్రవహించును. రక్తము లేకున్న నా యా కార్యములు జరగవు. కావున రెండు కార్యము లేక కాలమునఁ జేయరాదు.

పద్మినీజాతి స్త్రీలు నాలుగజామునఁ గలయఁ గోరుదురు. ఉత్తముల కుత్తమబుద్ధి స్వభావముగఁ గలుగును. అందఱకు నదియ మేలైన కాలము. అప్పటి కన్నము జీర్ణమైయుండును. సుఖనిద్రచేసి లేచుటచే నిరువురకు మనస్సులు ప్రసన్నములై దేహములు లాఘవముగా నుండును. వెంటనే లేచిపోయి స్నానము చేయుట కో దేహశుద్ధి చేసికొనుటకో యనుకూలపడును. అటులని 41/2 గంటలకు 5 గంటలకు లేచి యాదర బాదర బదనాయువుఁ గార్యమువలెఁ జేయరాదు. తొందరగా భుజించుటవలనఁ గలిగెడు కీడునకంటె తొందరపడి కలవరపడి నట్టు సంగమిచ్చుట యెక్కు వ కీడు. సంగమ కాలమున నిరువుర మనస్సులు వ్యాకులతలేనివై ప్రసన్నము లై ఇతర విచారములేనివై యుండవలయును. 2 మొదలు 41/2 తప్పిన యరుణోదయముగాక ముందువఱకు సంగమింపవచ్చుచు. అరుణోదయానంతరము సంగమింపరాదు. అర్ధరాత్రము నుభయసంధ్యలు పగలు నిషిద్ధములు ఉభయసంధ్యలయందు సంగమించిన క్రూరకర్ములగు రాక్షసుల వంటి బిడ్డలుపుట్టుదురు కైకసి విశ్రవసుని సాయంకాల వేళఁగా మించుటఁ జేసి రావణకుంభకర్ణులుపుట్టిరి. పగటి సంగమమువలనఁ బుణ్యనాశము మిగుల దౌర్బల్యమున గును. అర్ధ రాత్రము రాక్షసవేళ. భార్య ఋతుకాలమందు కోరెనేని యా సమయమందును గలయవచ్చును. ఇది యనుజ్ఞయే గాని విధికాదు. వారమున కెక్కు వపక్షమున రెండుమార్లను మించి కలియరాదు. భార్యా భర్తలిరువు రారోగ్యదశయం దుండిననే కలియవలయును. ఇరువురిలో నొకరి కనారోగ్యముగ నుండినను గలియరాదు. ఇరు వురిలో నొకరి కనారోగ్యముగ నుండినను గలియరాదు. ఇరువురకు మనస్సులు ప్రసన్నములుగా నుండవలయును. ముట్టయిన మొదటి మూఁడు దినములు భార్యాభర్తలు కలియరాదు. 4 వ దినము మొదలు 16 వ దినము వఱకుఁ గలియవచ్చును. ఈ దినములకే ఋతుకాలమని పేరు. ఈ ఋతుకాలమందే గర్భము నిలిచిన నిలువ వలయును గాని తరువాత నిలువదు ముట్టుదినమునకు ముందు 3 నాళ్ళలో గర్భము నిలుచుటయుఁ గలదు. దీనినే యెదురు వేఁకటి యందురు. ప్రసవించిన దినమును బట్టి దీనిని దెలిసికొనవచ్చును. కావున 16 దినములకుఁ దరువాతఁ గలియరాదు. ఆకాలమందైనను భార్య తానై కోరిన భర్త కలియవచ్చును, గాని భర్త బలవంత పెట్టరాదు. యోగ్యములని మీఁద చెప్పిన 13 దినములలో షష్ఠి, అష్టమి, చతుర్దసి, అమావాస్య పున్నమ శ్రాద్ధదినములు

జన్మనక్షత్రము బుధవారము ఏకాదశిమొదలైన వ్రత దినములు నిషిద్ధములు ఋతుకాలమందు భార్యకోరినను నెవఁడు కలియఁడో వాఁడు గర్భధ్వంసము చేసిన భ్రూణహుని పాపమునఁ బోవును, కలియ నిష్టపడని భార్యతోఁ బురుషుఁడు కలియరాదు. అది కోరినపుడు నిరాకరింపరాదు. భార్య కలియుటకుఁ గోరకయే యుండిన భర్తగతి యేమి యను భయ మక్క ఱలేదు. స్త్రీ లారోగ్యవతులై యుండిరేని ఋతుకాలములఁ గామము నిగ్రహించుకొని యుండలేరు. స్త్రీలకు సంతానకాంక్ష మెండు. కామముదయించియు నిగ్రహించుకొనిరేని యది వారికే చెఱుపు. కావున వారు సంగమమునకుఁ బ్రతికూలింపరు. లజ్జచే వారై హెచ్చరింపకుండిన ఋతుకాలముల మగవారు హెచ్చరించిన నంగీకారము సూచింతురు. సంగమకాలమున యజ్ఞోపవీతములను వీఁపుప్రక్క దండగ వేసికొనవలయును. సంగమ కాలంబున దంపతులు మౌనము వహింపవలయును. భార్యాభర్తలు కలియువఱకే యేకశయ్యయం దుండవలయును గాని తరువాత నుండరాదు. సంగమకాలమున వెలుతురుండరాదు. గర్భిణీ స్త్రీలతోఁ గలియరాదని మనశాస్త్రము చెప్పుచున్నది గాని పాశ్చాత్యులు గర్భిణి రోగరహితురాలుగ నుండెనేని గర్భస్రావ భయములోనగు వానిని సందేహింపఁ గారణము లేదేనిఁ గలియవచ్చునందురు గాని యిది ప్రశస్తముగాదు. సంగమకాలమందు ధరించిన వస్త్రములతో నుదయమున గృహకృత్యములు చేయరాదు. ఋతుకాలమున సరిదినములనఁగా 4-6-8-10-12-14-16 దినముల గర్భమునిలిచినఁ గొడుకు పుట్టును బేసిదినము లనఁగా 5-8-9-11-13-15 దినములగర్భము నిలిచినఁ గూతుఁరు పుట్టును. 16వ దినమున గర్భము నిలిచిన లోకోత్తర చరిత్రుఁడు పుట్టును. 15వ దినమున గర్భము నిలిచిన నట్టిదే కన్యక యుదయించును. పతికుడిభాగంబు నిలిచిన నట్టిదే కన్యక యుదయించును. పతి కుడి భాగంబునఁ బరుండి కలసినఁ గొడుకు పుట్టుననియు నెడమ భాగమందుండి కలసిన స్త్రీ శిశువు పుట్టుననియు పురుషుని దక్షిణాఁగములోని యింద్రియము స్త్రీ కుడియంకము లోనికిఁ బ్రవేశపెట్టినఁ గుమారుఁడే పుట్టుననియుఁ బురుషుని యెడమ యండకములోని యింద్రియము స్త్రీ యెడమ యండకము లోనికిఁ బ్రవేశింపఁజేసినఁ గొమార్తెయే పుట్టుననియుఁ బాశ్చాత్య కామశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఇటుచేయుట సులువే గాని యది స్త్రీలకు సాధ్యము. ఇది తప్పక ఫలించునని మాత్రము చెప్ప వలనుపడదు గాని ఫలించిన ఫలించవచ్చును. శుక్ల మెక్కు వయైన మగబిడ్డ లును శోణిత మెక్కువైన ఆఁడుబిడ్డలును పుట్టుదురు. రెండునూ సమానములైన నపుంసకుఁడు జనించును గావున వీర్యమెక్కు ౘడగు పదార్థములను పురుషులు భుజింపవలయును. ఈ నిమిత్తముగ మనవారు పుంసవనము చేయుదురు.

పురుషాయిత కేళియందు (పురుషునివలె స్త్రీ ప్రవర్తించినపుడు) గర్భము నిలిచిన నపుంసకుఁడు లేక స్త్రీ యాకారము చేష్టలు గలవాఁడు పుట్టును. కన్యకపుట్టినేని పురుష చేష్టలు కలిగి మఱియొక స్త్రీతో రమించునది యగును. నపుంసకత్వము స్త్రీల యందును గలదు. ఆరబయల సంగమింపరాదు. మీఁద సూత్రములవలె సంగ్రహముగఁ జెప్పిన విషయముల గుఱించి కొంచము విశదముగఁ జెప్పెదను.

సంగమమునకు భార్యల సమ్మత మత్యావశ్యకము. వారు సమ్మతింపకుండుటకుఁ గొన్ని గారణములు గలవు. భయముచేతను బలాత్కా రముచేతను సమ్మతింపఁ జేసినయెడల నట్టి సమ్మతి సమ్మతిగాదు. వాస్తవముగఁ గామము వారికి మనస్సునఁ బుట్టియుండవలయును. కామంబులేని కామినిఁ గామించిన యట్టి పురుషుఁ కాయము చెడును. భార్యలు కామము లేమిచే సమ్మతింపఁజాలరు. కామము కలుగకుండుటకు 1. ప్రాయము చాలమి 2. రోగాదిబాధ 3. గృహకృత్యములలో నత్తల యాఁడు బిడ్డపోరో మగని దుష్ట చేష్టలో యిత్యాదులు కారణములు.

మనలో నిప్పుడు ప్రబలియుండు ఘోరదురాచారమును బట్టి మొదటికారణము చెప్పవలసివచ్చినది. కన్యకలకుఁ గామోదయము 15 సంవత్సరములు మీఱినఁగాని కలుగదు. ఇప్పుడో 13-14 సంవత్సరములకు ముందే గర్భాధాన మహోత్సవములు వెల్లివిరియుచున్నవి. ఈ వయస్సున నవయవము లెంత కోమలములై పటుత్వము లేనివిగా నుండునో చివురుఁగొమ్మనిఁ జేవపుట్టినట్లు ఈ వయస్సున కామ మెట్లు పుట్టునో, యట్టిలేత యవయవము లెట్లు ఘర్షణకుఁ జాలునో యట్టి బలాత్కా ర ఘర్షణచే నవి యెట్లు రోగ యుక్తము లయియో దుర్బలము లయియో పాడవునో, దానివలన బ్రతికినంతకాల మెట్లు దేహారోగ్యము చెడియుండునో, దాని వలన దాంపత్య సుఖము చెడి దుఃఖరూపముగ మాఱునో, యాపిల్లదాని గ్రహచారముకొలఁది యావయస్సున గర్భము కూడ నిలిచెనేని యా గర్భభారమును ఆ లేఁతనరములు రాపిడిచే దుర్బలములైన వెట్లు భరింపఁగలుగునో, ఆ గర్భము నిలువక యెట్లు పడిపోవునో, యొకవేళ గర్భము నిలిచి ప్రసవించినను బ్రసవకాలముననేమి యంతకుఁ బూర్వమేమి దాని వేదన యెట్టిదై యుండునో, గతులుమాలిన జీవి యొకఁడు పుట్టినను పిందెలోనే పండిన యా

బిడ్డ యెట్లు దృఢకాయము నారోగ్యము కలిగియుండఁ గలుగునో, యారోగ్యము లేని బిడ్డలవలనఁ దల్లిదండ్రు లేమి సుఖ మనుభవింపవచ్చునో, యాలోచించు తెలివి పెద్దవారికిని భర్తలకును గూడ సర్వశూన్యమై యున్నది. ఈ కారణముచేతనే కుక్క మూతి పిందెల వంటి బిడ్డలు పుట్టుచున్నారు. బాలింత చావులు గర్భస్రావము లెక్కు వ యగుచున్నవి. చచ్చిన బిడ్డలు పుట్టుచున్నారు. ప్రాణముతోఁ బుట్టినను మఖలోఁ బుట్టి పుబ్బలోఁ జచ్చుచున్నారు. అట్లు చావనివా రర్ధాయువులు దీర్ఘరోగు లగుచున్నారు. గర్భములను గత్తులు కటారులు దూర్చి ఛేదింపవలసి వచ్చుచున్నది. గర్భిణులకు మానము ప్రాణముకూడఁ బోవుచున్నది. వైద్యులు బ్రతికి పోవుచున్నారు. సంసారములు కూలుచున్నవి.

వివాహ మెప్పుడు చేసినను 16వ సంవత్సరము పుట్టకముందు గర్భదానము చేయరాదు. సమర్తాడి నంత మాత్రముననే సంభోగార్హ్వ త వచ్చినదనుకొనుట యనేక సందర్భములలో భ్రాంతియగుచున్నది. వాస్తవ రజోదర్శనము యుక్త వయస్సు 15-16 సంవత్సరములకు ముందుగాదు. 13-14 సంవత్సరములలో సమర్తాడుట వయస్సువచ్చి సమర్తాడుట కాదనియు దేహదౌర్బల్యము మొదలైన కారణములచే నట్లగుననియు వైద్యులు వ్రాసియున్నారు. కావుననే వయస్సున రజోదర్శనమైనను 15వ సంవత్సరము దాఁటకముందు గర్భాధానము జరుపరాదు. సరియైన ప్రాయము రాకముందే రజోదర్శన మగుటకుఁ గొన్ని కారణములు గలవు. 1. యుక్త వయస్సు రాకముందు భార్యాభర్త లొక యింటి యందే యుండుట, 2. వ్యాధి, 3. కామోద్దీపకములైన కథలు చదువుట, వినుట, యట్టి వ్యాపారమం దుండువారిని తఱచు, చూచుట, యిత్యాదులు వయస్సు రాకముందు సమర్తాడుటకుఁ గారణములు. ఉద్దీపనములచే మనస్సునకు నింద్రియములకు నుద్రేకము కలిగి నరములు సడలుటచే రక్తము స్రవించును గాని యది యవయవ పరిపూర్తిచే నగు రజోదర్శనము కాదు. ఇది కుండనిండ నీళ్లు పొర్లిపోవుట గాదు. కుండయందుఁ బగులుపాఱఁ జేయుటచే నగునది. ఓటికుండలో నీరు వెలుపల రాఁగానే కుండ నిండినదనుట యేమి తెలివి ? ఇట్టి సందర్భముల బాలికలకుఁ గామ మెట్లు గలుగును ? సుఖమెట్లు తెలియును ? అట్టివారి సమ్మతి యొక సమ్మతి యనవచ్చునా ?

కసిగాయ కొఱకిన రుచియుండదని తెలియని బాలురు తాము కాటుపెట్టి కాయలను జెఱచుటేగాక మీఁదు మిక్కి లి యవి బాగులేదని పాడుకాయలని తిట్టుచుందురు వయస్సు వచ్చిన భర్తల తెలివి యింతకంటె నుత్తమమైనదని చెప్పసాధ్యపడదు. బుద్ధిలేని భర్తలు బాలికల దేహమును సౌఖ్యమును జెఱచుటయే కాక దుష్టబుద్ధులై "నా పెండ్లాని కెప్పుడు రోగమే. నిర్భాగ్యురాలు దాపరించిన" దని మొఱుగుచుందురు. నిర్భాగ్యుని వరించుటచే దానికిని నిర్భాగ్యదశ పట్టినది. కాని బుద్ధిమంతుని చెట్టపట్టి యుండిన నది సౌభాగ్యవతిగానే యుండి యుండును. సర్వదా నిర్భాగ్యుఁడు వీఁడే. ఇట్టి మతిహీనులకు నరకమున నెట్టి శిక్ష యుండునో, (ఈ విషయమున ననేక సందర్భములయందు బాలుర తల్లిదండ్రులు దూష్యులు). ఇట్టి వారిని పశువులతోఁ బోల్చుట తప్పు పశువులు పక్షులు ఋతుకాలములందుఁ దప్పఁ దక్కి న వేళలందుఁ గలియవు. ఈ కార్యము నిత్యవిధిగా నుంచుకొనవు. పెంటిని నయోపాయముల సమ్మతింపఁ జేసిన పోతు కలియును గాని కోడి తప్ప బలాత్కా రముగ నేదియుఁ గలియదు. వృక్షము లాయా ఋతువునందే పుష్పించును. ఫలించును. ఆ కాలపుఁ గావు లెట్లుండునో యకాలపుఁ గావు లెట్లుండునో చూడుము. మంచిచెడ్డ తెలిసికొని ప్రవర్తింపుమని దేవుఁడిచ్చిన బుద్ధిని గామదాసుఁడై దుర్వినియోగ పఱిచి స్వభావధర్మము మఱచి మనుష్యుఁడు ప్రవర్తించి తాను జెడి భార్యలను బిడ్డలను గూడఁ జెఱుచుచున్నాఁడు. స్త్రీలును తమవలె మనుష్యజాతిలోఁ జేరిన వారనియు వారికొక మనసున్న దనియుఁ దమ దేహములపైఁ దమకు స్వాతంత్ర్య మున్నట్టు వారి దేహములపై వారికి స్వాతంత్ర్యమున్నదనియుఁ దమతో నన్ని విషయముల సమానులనియు కావున వారిని సమ్మతింపఁ జేసి వారిని వశ్యురాండ్రుగాఁ జేసికొనుటకు యుభయులకును నుభయలోకముల శ్రేయస్క రమనియుఁ దలఁప లేని స్థితికి పురుషులు వచ్చియున్నారు. కామము కన్నులఁ గాననీయక చెవులను విననీయక యుండు నిట్టి దశయందు హితబోధము లెవ్వరి తల కెక్కు ను గాని తెలిసిన విషయము తెలియనివారికి చెప్ప వలయునని విధి గావున నా కార్యము నేను చేయుచున్నాను.

భార్య సమ్మతింపకుండుటకు రెండవ కారణము దేహము స్వస్థముగలేకుండుట. సామాన్యమైన యజీర్ణ వ్యాధియు సంగమునందిచ్చును దొలఁగించును భార్యకుఁగాని భర్తకుఁగాని యారోగ్యము చెడినప్పుడు సంభోగించుటవలన వ్యాధి మఱింత యెక్కు వగును. దేహము క్షీణించును. అట్టి సమయమున గర్భము నిలిచెనా యా స్త్రీ దేహము విశేషించి చెడుటయే గాక యామెకుఁ బుట్టెడి బిడ్డలును వ్యాధిగ్రస్తులుగను నుందురు. పుట్టురోగులకు

బుద్ధిబల మెచ్చటినుండి వచ్చును ? అట్టివారి సంతాన మదెట్లులుండును ? తమ యారోగ్యము బాగుండెనా కొందఱు స్త్రీల యారోగ్యము బాగుగ లేదని యెఱిఁగియు బలాత్క రింతురు. భార్యలు తమకు దాసురాండ్రని దామెప్పుడు పిలిచినప్పుడు సిద్ధముగ నుండవలయుననియు వీరి యభిప్రాయము. ఇట్టి వారికి వంటపాత్రయందుండు గౌరవముకూడ భార్యలయం దుండదు. ప్రతిదినము ప్రొయ్యిపై నుంచి కాల్చినను త్రోమినను పాత్రమఱిగిపోవునని తలంతురు. గాని భార్యవిషయమై యా మాత్రముకూడఁ దలఁపరు. భార్యలు తమకు బానిసలని తలఁచువారు తమ తల్లులు అక్క సెల్లెండ్రుగూడ మఱియొకరికి బానిసలే కదా యనియుఁ దాను బానిసదాని పుత్రుఁడు బానిసదాని తోడఁబుట్టినవాఁ డని తలఁపవలయును. ఆహా ! యీ యపూర్వబుద్ధిమంతులకు తల్లిదోడులపై నెట్టి గౌరవబుద్ధి! ఎట్టి ప్రీతి ! ! ఇట్టి వీరి నాకారమాత్ర మనుష్యులనుట తప్పుగాదు.

భార్యకు మనస్సు స్వస్థముగా లేనప్పుడును బలవంత పెట్టరాదు. ఇది భార్యకును సంతానమునకుఁ గూడ హానికరము. ఇవన్నియుఁ దప్పులని దెలిసియుఁ గామాతిరేకముచేఁ బ్రవర్తింప దలఁచితివా నీవు బాగుపడి యితరులును బాగుండవలయు ననియైనఁ గోరిక గలదేని భోజనము కాఁగానే నిన్నొక గదిలోవేసి బీగము వైచి బీగము చెవిని నీ యొద్దనుంచుకొని నీకక్క ఱ పుట్టినపుడు పిలువుమని నీ భార్యతో చెప్పుము. ఇది క్షేమకరము గావున నవమానకరమైనది గాదు. త్రాగుఁబోతుతనము వలె నతికామము రోగచిహ్నమే కాని యారోగ్యచిహ్నముకాదు. ఆరోగ్యవంతుఁడును బాగుగ పాటుపడువాఁడును చక్క ఁగ దేహపరిశ్రమము చేయువాఁడును, మితభోజియుఁ, గాముకుఁడు కాఁజాలఁడు. కావున రోగికిఁ జికిత్స చేసినట్టు లతనికిఁ జికిత్స చేయవలయును, భార్యతన్ను గదిలోవేసి బిగించి రాత్రియంతయు దేశసంచారము చేయునదో తానుబోయి వాకిటఁబండుకొనునదో లేక తలవాకిలి తీసి యుంచునదో యైనయెడల పురుషుఁ డిట్లు చేయు మనరాదు. వేఱువేఱుపడుకలపైఁ బరుండినఁజాలును పురుషున కిష్టముండినను లేకుండినను భార్య కోరినప్పు డంతయుఁ దన్నుఁ బీడించుచుండినను, దానికి భయపడి లోపడి వేఱుమార్గము లేక కలియవలసివచ్చినను భర్త యెట్లు సహించునో వాని మనస్థితి యెట్లుండునో యది యూహించుకొని పురుషులు స్త్రీల విషయమై ప్రవర్తింపవలయును.

భార్యాభర్తృ సంగమమునకుఁ గామమే కారణము కావలయును. సత్సంతానము కామఫలముగా నుద్దేశింప వలయును. కామ మనునది నిర్మలమనోవ్యాపారమనియు గజ్జి పుండ్ల దురదవంటిది గాదనియుఁ దెలియును. స్త్రీలకుఁ గాని పురుషులకుఁ గాని దేహము మనస్సు స్వస్థముగ లేనప్పుడు కామ ముదయింపదు. కామ ముదయింప నపుడు కలియుటయుఁ గలిగినపుడు కలియకుండుటయు సరిగాదు. కాని యా సమయమున నుదయించెనేని యాపవలయును. సంతానాపేక్ష చేతనే సంగమింపవలయునుగాని మఱియే కారణముచేతను గలియరాదు.

జారుఁ డెట్లు జారిణిని నవ్వుమాటలచేతను ఫలమూలాది దానాదులచేతను ఆశలచేతను లాలించి బేలించి వశపఱచుకొనునో యట్లే భర్తయును దొలిదినమునుండి భార్యా విషయమై నడచుకొనవలయును గాని కటికివాఁడు పసరమును దోలుకొని పోయినట్లును రావణుఁడు రంభతోఁ గలసినట్లును వర్తింపరాదు. ఈ కారణము చేతనే రతివేళ భార్యలతో బొంకినను దోషమురాదని శాస్త్రము చెప్పుచున్నది.

భార్యసమ్మతింపకుండుటకు మూఁడవ కారణము ఇంటిలో నత్తల యాఁడు బిడ్డలపోరో మగని దుశ్చేష్టలో చెడువార్త యేదైన వినుటో యగును. ఇందుమూఁడవది యనివార్యము. తన దుశ్చేష్టవలన భార్య కోపించినదాయెనా భర్త తన చేష్టలను తప్పక మానుటే కర్తవ్యము. కోరరానివి సాధ్యము గానివి పనికిమాలినవి దుర్వ్యయము చేయవలసినవి యగుకోరికలఁ గోరిన మంచిమాటలచేత కారణములు చెప్పి శాంతి పఱుపవలయును. అప్పటికి వినదేని దాని తలవ్రాఁత యంతే యనుకొని భర్త యది తానుగా శాంతించువఱకుఁ బలుకరింప కుండవలెను. ఇంటిలోని పోరాయెనా మగవాని స్థితి యడకత్తులోని పోఁకవంటిదే, క్రొత్త కోడండ్ర విషయమున ధూర్తలత్త లాఁడుబిడ్డలే యని నమ్మెద. ఇరువురు ప్రాఁతపడిన తరువాత కోడండ్రే ధూర్తరాండ్రుగా నుండిన నుందురు. ఇది సర్వత్ర యన్వయించునదిగాదు. వారి వారి గుణముల ననుసరించి పురుషులు ప్రవర్తింపవలయును. నేను జెప్పునది వ్యాకుల చిత్తలైన భార్యలతో సంగమింపరాదనియే నూర్గు రత్తల చేతఁ బడెడి బాధకంటెఁ బెద్ద తల్లులు మొదలగు వారిచే నధిక బాధపడు నిల్లాండ్ర నెఱుఁగుదువు కదా. అత్తలు మంచివారును గలరు. ఆత్మీయులు దుష్టులును గలరు.

# మిత సంభోగము

ఏ యవయవమునైనను దాని శక్తి సామర్థ్యములు తెలిసి మితముగ నుపయోగించిననే యారోగ్యము కలుగును గాని శక్తికి మించినపని చేయించిన చెడునని ముందొకసారి చెప్పితిని గదా. అతి సర్వత్రవర్జ యేత్తనుట యన్ని విషయములందును సత్యము. శక్తికి మించిన పనిచేయించినచో జీవజంతువులును యంత్రములు నెట్లు చెడునో చెడునో తెలియదా ? దేహ యంత్రమునకంటె నాణెమైనదియు పూర్ణమైనదియు గందరగోళమైనదియు, నూహించి పూర్ణముగఁ దెలిసికొన సాధ్యపడ నిదియు నగు యంత్రమేదికలదు ? కావున నీ యంత్రలక్షణ మెఱిఁగి యుపయోగించిన దీర్ఘ కాలముచక్క ఁగాఁబనిచేయును.

అతిభుక్తియు నాఁకలిగాని తిండియు దుష్టాహారము కడుపును జెఱుచునుగదా? ఆహారవిషయమై యాఁకలి వేఱనియు ఆశవేఱనియు ఆశ దురభ్యాసముచే వృద్ధియగుననియు నది యారోగ్యమును జెఱుచుననియు ఆఁకలి యెఱిఁగి తినిన దేహారోగ్యము బలము కలుగుననియు ముందొకసారి చెప్పితిని గదా. భోగేంద్రియవిషయము నట్టిదనియే యెఱుంగవలయును. అతిసంగమము; ఒక్క సారియైనను దుష్టస్త్రీ సంగమము, మనస్సును బుద్ధిని దేహమును గూడఁ జెఱుచును. నానావిధ రోగములు కలిగించును ఆయువు క్షీణింపఁజేయును. తొలుత నల్పముతోఁ బ్రారంభమైనను కాపీనీళ్లు, తేనీళ్లు, సారాయి, కల్లు, నల్లమందు మొదలైనవి యభ్యాసముచే బలపడి తరువాత వీఁడు తొలి సంగమములందుఁ గ్రొత్తొక వింతయని పలుమాఱు సేవించినయెడల నా దురభ్యాసమే పట్టుపడి దినకృత్యముగ నేర్పడి హాని కలిగించును. ఆఁకలిగొన్నవాఁ డాహారమునఁ గనురుచి యారోగ్యము లేని తిండిపోతు పొందలేనటు నిత్యము కామమును సేవించువాఁడు దానియందలి యానందమును గాని దానివలనఁ గలుగు మేలుగాని పొందఁజాలఁడు. మితముగ భుజించువాఁడే యజీర్ణాదిరోగపీడితుఁడు గాక వృద్ధుఁడైనను చక్క ఁగ భుజించి జీర్ణించుకొను శక్తిగలవాఁడగును గాని కుక్షింభరుఁ డజీర్ణ శూలాదిరోగములచే యౌవనమందే కడుపు చెఱచుకొని శీఘ్రకాలమునందే పథ్యపుఁగూడు తినవలసినవాఁడై వార్ధకమువఱకు బ్రతికినను దుఃఖితుఁడగును. అటులే మితముగఁ గామమును సేవించువాఁడు వాస్తవానందము ననుభవించువాఁడగుటయే గాక వృద్ధుఁడైనను సుఖమనుభవింపఁ గలుగును. కావున నిషిద్ధదినములందును గాలములందును భార్యతో రమింపరాదు. ఉపవాస వ్రతములు రోగములను హరించి యారోగ్యమును బెంచి యింద్రియముల వశపడునట్లు చేయును. అట్టులే శుద్ధ బ్రహ్మచర్యము అనఁగా రతియే వర్జించుట యారోగ్యమును బెంచి రోగముల హరించి దేహబల బుద్ధిబలముల నభివృద్ధిచేసి జితేంద్రియుని జేయును. ఇది స్త్రీ పురుష సామాన్యమే కాని యిరువురు దేహముచేత మాత్రము కార్యము చాలించి మనస్సుచే ధ్యానించుచుండుట మిగుల హానికరము. కావున మితసంగమము ప్రశస్తముగాఁ జెప్పఁబడినది. శుష్క బ్రహ్మచర్యము యోగాభ్యాసము చేయు జితేంద్రియులకు మాత్రమే సాధ్యము, లాభకరము. తక్కి న వారి కసాధ్యము, హానికరము యోగులకును యావజ్జీవము మనస్సు నిలుపుట దుష్క రమై యుండ సంసారులమాట చెప్పనేల? మిథునకర్మము చాలించుట స్త్రీలకు మిక్కి లి హానికరము. 'అమైథునం జరాస్త్రీణా మని కలదు. భర్త జారుఁడై భార్య కామిని సుశీలయై యుండెనేని యామె ముఖమున గళ కాంతి లేక దేహము వెల్లపాఱియుండును. ఆరోగ్యము చక్క ఁగఁ గాపాడుకొనుచు మితాహారులై పుణ్యచరిత్రము నందు మనస్సు దవిలి కామముపై మనస్సు పోనీయనివారికి బ్రహ్మచర్యమును మించినది లేదు. దీనికి దృష్టాంతము పతిహీనులై బ్రహ్మచర్య వ్రతము నాచరించు పుణ్యస్త్రీలే. ఇట్టి వారికిఁ గామముపై మనసుపోదు. వీరు దృఢగాత్రలై దీర్ఘకాలము బ్రతుకుదురు. అట్టి వ్రతము నాచరింపనివారే మిండగాండ్రకై వెదకికొనువారును మాఱుమగలఁగోరు వారునై యున్నారు. అట్టి దుశ్చరిత్రముగల మగవారును, సంఘబహిష్కృతులై కులకన్యల వివాహమాడ సాధ్యపడనివారును, ఆ ముండల కాశపడి వారిపేరు పెట్టి విధవావిలాపము లనుపేర పత్రికా ముఖములందును దమ గ్రంథములందును దామే యేడ్చుచుందురు ఆహా యెట్టి దయ ! మితనిద్రాహారాదులచేఁ గామము నణఁచి బాగుపడుటకు మాఱు పందులవలెఁ దిని కండలుపెంచి నసరేఁగి మిండల నెతకికొను ముండల నేమనవలయును ? తమ కండూతి నివారణార్థమై యట్టివారికై వగలయేడ్పులేడ్చెడి మగముండలను కామదాసులను బురుషాధముల నేమనవలయును ? వా రెంత లా వెంత పొడు గెంత ధనమెంత యధికార మెన్ని బిరుదులు లావు పిఱుఁదులుగలవారైన నగుదురుగాక. కామమును వృద్ధిచేసుకొనుమని చెప్పుకాముకీదాసుల మాటలు చెవిచెంత రానీయకుము. వారిని మనుష్యులుగా నెంచకుము ఏ విధముగానైనఁ గామము నణఁచుటకుఁ బ్రయత్నించుట మేలో నిచ్చకొలఁది కామము సేవించుట మేలో యెఱుఁగఁగల జ్ఞానము లేనివారు మనుష్య లెట్లగుదురు ? ధర్మమార్గమునఁ గామము సేవించుట సంతానార్థమని

యట్టి సంతానము మోక్షార్థమని కామమున కుద్దేశము మోక్షమని తెలియక కండూతి నివారణార్థమే కామమను వారు మనుష్యు లెట్లగుదురు ? స్త్రీ పురుషులు కలియుట మాత్రమే పరమార్థమయ్యెనేని యట్టి వారికంటెను బశువులు మేలు కదా ? త్రాగుబోతుల బిడ్డలు త్రాగుఁబోతు లగుచున్నారు. వారికిఁ ద్రాగుఁబోతులు స్నేహితు లగుచున్నారు. దీనివలన వారి త్రాగుబోతుతనము హెచ్చుచున్నది. అటులని యట్టివారు త్రాగకుండుట కష్టము కావున త్రాగుఁబోతుతనము మంచిదని యే జడుఁడు చెప్పును ? అట్టులే కామదాసులకుఁ బుట్టి కామమునందే పెంపఁబడి కామోద్రేకములనే భుజించుచు నన్నివిధములఁ గామమునే సేవించుచుఁ గామదాసులే స్నేహితులైన వారికిఁ గామము జయించుట కష్టమే యగును గాని తెలివిగలవాఁడు కామమునకు లోపడుట మంచిదని చెప్పునా? ఏకారణముచే రోగము జనించెనో ధానినే సేవింపు మని చెప్పువాఁడు తెలివిగల వైద్యుఁడా ? ఉష్ణ ముష్ణముచే శమించునని పరమానందయ్యగాని శిష్యు లాయన తల్లికి జ్వరమువచ్చినపుడు ఆమెను మంటలలోఁ గాల్చినట్టు కామరోగపీడితులకు మిండగాండ్రను గుదుర్చుచు, ననుకూలపడిన చోటఁ దామే భర్తలగుచుఁ జరించువారు లోకోద్ధారకులఁట. భూతదయా పశ్చాత్తాపములు గలవారఁట. ఇంతకంటెను వంచకులు నసత్యవాదులు లోకమునఁ గలుగుదురా ? కలుగరు, కలుగరు. ముమ్మాటికిఁ గలుగరు. ఒక వంశము చెడిపోవ నుండు సమయమునఁ గుపుత్రుఁ డెట్లు పుట్టునో యట్లే యొక దేశము చెడిపోవ నుండు సమయమున మతిహీనులు పుట్టుదురు. వారి మాటలు విని తెలివిలేనివారు జెడుదురు. కలియుగ ధర్మోద్ధారకులు వీరే సుమీ ?

సత్కామ ముభయలోక సుఖప్రదమనియు దుష్కా మ ముభయలోకములఁ జెఱుచుననియు సత్య మాలోచింప శక్తి నీకుఁ గలదేని నీవే తెలిసికొనగలవు. భార్యయందైనను నియమబద్ధుఁడు గాక విచ్చలవిడి విహరించువాఁడు దుష్కా ముకుఁడే.

కుమారదశయందుఁ దన పిడికిలినే భార్యగాఁ జేసికొన్న వాఁడును, జారుఁడును, దిసమొల పటములను బలుమాఱు చూచుచుండువాఁడును, కామమును బ్రేరేపించుకథలు చదువువాఁడును, వినువాఁడును, నట్టి తిండి తినువాఁడును, కామవిషయ మాలోచించుచుండు వాఁడును, స్త్రీ సాంగత్య విషయమున వికారాభిప్రాయమలు విపరీతభావనలు గలవాఁ డును. అతి భోగపరుఁడైనవాఁడును తన బుద్ధిబలమును దేహబలమును జెఱుకొనుటయే గాక భార్యను దన యట్టిదానిఁ గాఁ జేయును. అంతతోఁ బోయిన మేలే. ఇట్టివారు తమకుఁ బుట్టెడిబిడ్డలకు మఱేమి సంపాదించి పెట్టకపోయినను రోగములో దేహ మనోదౌర్భల్యములో కామదాస్యమో కావలసినంత సిద్ధముగ నుంచుకొని గర్భముననే వారికి వాని ననుగ్రహింతురు.

ఏకశయ్యయందు భార్యాభర్త లిరువురు రాత్రియంతయుఁ బరుండుట హానికరము.

1. మనుష్యులు పీల్చునది ప్రాణవాయువనియు విడుచునది విషవాయుననియు తెలియునుగదా ? ఒకరు విడుచు విషవాయువును మఱియొకరు రాత్రియంతయు బీల్చిన నారోగ్యము చెడుట కేమి సందేహము ?

2. ఒక వేఁడినీళ్ళపాత్ర ప్రక్క నఁ జలినీళ్ళపాత్ర నుంచిన చల్లనీళ్లు వేఁడిగాను, వేఁడినీళ్లు చల్లగాను నగునుగదా? అటులే యిరువురు కూడఁ బరుండిన నొకరి దేహము వేఁడిమి మఱియొకరికి వచ్చి యిరువుర యారోగ్యము చెడును.

3. ప్రాణశక్తిని గుఱించి ముందు చెప్పితిని గదా ? అట్టి ప్రాణశక్తియు వేఁడిమివలెనే పోవుటచే దానిని బోఁగొట్టుకొన్నవారు నష్టపడుదురు.

4. భార్యాభర్త లొక పానుపుపైఁ బరుండిన వారి కాలుసేతు లూరక యుండవు. ఏదియో కుచేష్ట చేయుచునే యుండును. కావున వారి కిరువురకు మంచినిద్ర యరుదగును.

5. దిసమొలతో నుండు స్త్రీలను జూచినఁ గామముద్రేకించును. అది పరస్త్రీ విషయమైనచో మనస్సంగమ రూపకమైన వ్యభిచారదోషము ప్రాప్తించును. నగ్నస్త్రీలను జూచి మనస్సు చలింపనీక రక్షించుకొనుటకు హనుమంతు నంతటివానికిఁ గాక యితరులకు సాధ్యపడదు. అంతేకాదు ఒకసారి నగ్నస్త్రీలను నగ్నచిత్రపటములను జూచిన యెడల వాని యాకార మెన్నిసంవత్సరములైన మనస్సున స్పష్టముగఁ గానవచ్చుచుండును. వీనిని మఱచుట కష్టతమము. కావుననే దిసమొలతో నుండు భార్యను జూచుటచే వ్యభిచారదోషము రాకున్నను ఆసమయమందును నట్టి స్వరూపము కన్నులకెదుట గోచరించుచుండుట మేలుగాదు. కావున సంగమ సమయమున దీపము వెలుతురుండరాదని పెద్దలు నిషేధించిన కామకుల కీ పద్ధతులు రుచింపవు.

6. ఏకశయ్యయందుఁ బరుండినఁ గామచేష్ట రాత్రియంతయు లేకయుండినను మనస్సునఁ గామము తగ్గదు. భిన్నశయ్యలఁ బరుండినఁ గామోద్రేకము తగ్గును. సర్వదా బిరడలు బిగించిన వీణెతంతెలు చెడునట్లు దీర్ఘకాలము కామోద్రేకము నరములను బలహీనములఁ జేయును. కావున సంగమసౌఖ్యము తగ్గుచు పోవును. వీణెవాయించునపుడు శ్రుతిగూర్చినట్టు సమయమున మాత్రమే కామ ముదయింపఁ జేయవలయును. వేఱు వేఱు మంచములపైఁ బరుఁడ నెడముచాలని యిండ్లలో దిండ్ల నడ్డముగ వేసియైన నొక రొకప్రక్క న మఱియొకరు మఱియొక ప్రక్క నఁ దిరిగి పండుకొనవలయును.

## వంశ పరంపరాగతము

భూమి మీఁదఁబుట్టునట్టి ప్రతిశిశువు స్వభావమున ఆరోగ్య, దేహబలము గలిగి యుండవలయును. అట్లాశిశు వుండకపోయిన నది తల్లిదండ్రుల దోషమే. జీవుఁడు కరణకళేబరము ధరించిగాని కర్మములు చేసి ముక్తిఁ బడయఁజాలఁడు. అట్టి కరణకళేబరము నొసఁగువారు తల్లిదండ్రులు. అట్లు వారిచ్చిన దేహము జీవునకు సాధకముగాక బాధక మయ్యెనేని యా పాప మెవరిది ? క్రుళ్ళినట్టి పాసినట్టి పండు దానము చేసినఁ బాపము వచ్చునా పుణ్యము వచ్చునా ? పాపమేకదా వచ్చును. దాహము కొన్నవారి కుప్పునీళ్ళిచ్చిన పాపమేకదా వచ్చును. అట్లే యారోగ్యము దేహబలము మనోబలములేని దేహమును దమ్మాశ్రయించి తమయందుఁ జేరిన జీవునఁ కిచ్చి రేని పాపము వచ్చునుగాని పుణ్యము రాదు. కావున నట్టి పాపఫలమును దల్లిదండ్రులుభయలోకముల ననుభవింపక తప్పదు. ఈ దోషము క్షమింపఁబడదు. వికలాంగుఁడు, రోగి, దుష్టుఁడు, కునిష్ఠుఁడునగు శిశువు బాల్యము మొదలు తల్లిదండ్రుల సౌఖ్యము చెఱుచును. పెద్దవాఁడైనను వానివలనఁ దల్లిదండ్రులకు సుఖములేదు. వారనా చారులు దురాచారులు దేవపితృ గురుభక్తి లేనివారై రేని పెద్దవారి కూర్ధ్వగతులు లేవు. ఇదంతయుఁ దను దోషమునకుఁగా విధింపఁబడిన శిక్షయని యెఱుఁగని మూఢులు బిడ్డలఁ దిట్టుచుందురు. ఇట్టి శిక్షకు వెఱచినవా రా పాపములను జేయకుందురు. అట్టివారి వలననే లోకము బాగుపడవలయును. బాగుపడును.

సంగమ సమయమున స్త్రీపురుషుల దేహగుణము మనోగుణము నీతిగుణము ఎట్టులుండునో వారికిఁ బుట్టెడి బిడ్డలకు నట్టి దేహగుణము నీతిగుణము మనోగుణమే యుండును. ఇది నిర్వివాదవిషయము. ఇది మనుష్యులందే కాదు. వృక్షపశు పక్ష్యాదులందును నియతము. జననీజనకుల సంగమకాల మందలి ఆకారము. ముఖము, గుణము, దేహసౌష్ఠవము పుట్టెడిబిడ్డ యుం దచ్చొత్తినట్లుండును. వారివారి వీర్యము వారి వారి దేహమన స్థితులంబట్టి యుండుననుట సిద్ధాంతము. ఈ స్వభావధర్మము నెఱిఁగియే కర్షకులు మంచివిత్తనములను ఋతువుల నద నెఱిఁగి విత్తుదురు. పశువుల మేపువారును ఋతువులందే మంచిపోతులుగానేటి దాఁటింతురు. అంతేకాదు వాని కా సమయమున నెదురుగా బలిసిన తజ్జాతి జంతువులను కట్టియుంతురు. కలయునట్టి పోతు పెంటి యా జంతువును జూచుచుండెనేని బలిష్ఠమైన జంతువు పుట్టును. తమరు పోషించు పశుపక్ష్యాదులం దీనియతిని మనుష్యులు పాటించుచు రతివిషయమందు నుపేక్షించుటే చిత్రము. తమయింట మంచిపశువులు, పక్షులు పుట్టవలయునని కోరి యావిషయమై యెంతో శ్రద్ధ వహించుండువారే కురూపులు, వికలాంగులు, రోగులు చెడు గుణములు గలవారు నగుబిడ్డలఁ గనుచున్నారు. కన్నతరువాతనైనను ఆ లోపములకుఁ దగిన ప్రతిక్రియలు చేయక యుపేక్షించుచున్నారు. ఇది యెంత దుఃఖకరము. జనసముదాయమునకు దేశమునకుఁ దమకుఁ దమ వంశమున కిది యెంతకీడు కలిగించుచున్నదో యాలోచించు బుద్ధిమంతు లేరి ? ఇట్టి నప్పుతట్టలు దేశమునఁ బ్రబలుకొలఁది సజ్జనులకును వారి బిడ్డలకును కీడు కలుగక తప్పదు. సాధువులు తమ బిడ్డలను దామింట నెంత హెచ్చరికతోఁ బెంచినను వలదు వలదనఁగా బుట్టిన తుంటరులతో వారు స్నేహము చేసియో స్నేహము లేకున్నను ఊరక కలసి తిరిగియో చెడకపోరు. పొగాకుచుట్ట త్రాఁగెడి యొకఁ డెందఱ యారోగ్యమును జెఱుచునో యోజింపుము. ఒక దొంగ యెందఱకు మనోవ్యాకులత కలిగించునో యాలోచింపుము. ఒక జారుఁడెందఱ సంసారములను బాగుచేయఁగలఁడో భావింపుము. సిగ్గువిడిచి నడివీధులలో నిలఁబడి బండబూతులను దిట్టుకొనువారిని జూచి బాలు రెంద ఱింట నా ప్రకారమే తల్లిదండ్రులందే యా శబ్దములను బ్రయోగింతురో తెలియదా ? ఒక అంకులాఁడి లంజ యెందఱు పురుషులను జెఱుచునో యెఱుఁ గవా? వీరు పైరులందుఁ బెరుఁగు గడ్డిగాదమువంటివారు. వీరు జనసముదాయమున కెడఁదెగని మారీరోగమునవంటివారు. వారి శ్వాసము విషవాయువు. వారి స్పర్శ దావాగ్ని. గాలి కుంటు తగిలిన పసరమును దక్కి న పసరములలోఁ గలువక యుంచునటులు వీరి నందఱి నూరిబైట నెందేని యుంచునట్లు శాసనము పుట్టినఁ జాల మేలు జాతిచండాలురును వీరిని స్ప్రుశింపరాదు.

డాయరాదు. మన పూర్వచరిత్రలందు వైధవ్యము లేదు. బాలమరణమును లేదు. ప్రజలు దీర్ఘాయువులు అరోగులు నని యీ విధముగ వ్రాయఁబడియున్నదికదా. ఇప్పటివారి చరిత్రములు చెప్పుకోరానివి గనుక నిప్పటి చరిత్రములందు నట్టి విషయములు వ్రాయఁబడవు. ఈ సంవత్సరమున వీఁడుపుట్టెను. వాఁడు చచ్చెను. ఆ యుద్ధము జరిగెను. దానిలో నిందఱు చచ్చిరి. క్రౌర్యమునందు వాఁడు వీనిని మించెను అని వ్రాయుదురేగాని సత్యమైన చరిత్ర మెందైన గానవచ్చుచున్నదా ? ఒక్క విషయముననే మూఁడు దేశములవారు మూఁడు విధముల వ్రాయుట మనము కనులారఁ జూచుచున్నాముకదా. వినుచున్నాముకదా ? ఏయే దేశమువారా యా దేశమున కనుకూలముగఁ దాము సత్యాత్ములమని యితరులు దుష్టులని వ్రాయుచుందురు. దీనికి మీరు చదువుహిందూదేశ చరిత్రమే ప్రబల దృష్టాంతము. దానిలో నెన్నియో యబద్ధము లున్నట్టు లిప్పు డేర్పడుచున్నవి కదా. ఇప్పటి ప్రజలగతి యిట్టిది. చరిత్రముల గతి యిట్టిది. ఏదో ధోరణి మీఁద నప్రస్తుతప్రశంస చేసితి నిది పోనిమ్ము. ఒకరి బాగు బాగు గాదు. అందఱు బాగుండిననే బాగు. ఆ నిమిత్తమై చెప్పితిని. అందఱ మేలు మనము కోరుచు మనము బాగుండ యత్నింపవలయును. ఫలము దైవాధీనము. నేను మీరు లోకమును జక్క దిద్దలేము. నేను పెద్దవాఁడను గావున నా యోగక్షేమముల కర్తృమార్గమున నేను జరించుచున్నాను. మీరు చిన్నవాండ్రు గావున మీ యోగక్షేమములకుఁ గావలసినవి చెప్పుచున్నాను.

నాయనా ! తమ బిడ్డ లందముగలవారుగా నుండవలయునని కోరని తల్లిదండ్రు లెందైనఁ గలరా? అందమనఁగా నవయవసౌష్ఠవమని యిదివఱకే చెప్పితినిగదా? అవయవములన్నియుఁ బరిపూర్ణముగ నుచితపరిమితి యాకారము గలగియుండుటే చక్కఁదనము, మంచియారోగ్యము బలముగల దశయందే యవయవము లట్లుండును. కావున మంచి యారోగ్యవంతుఁడే సుందరుఁడు ఆరోగ్యవంతులైన తల్లిదండ్రులకే యారోగ్యవంతుఁడైన పుత్రుఁడు పుట్టును. ఈ లక్షణమును బట్టి చూచినఁ జక్కఁదనముగల బిడ్డలఁ గనుట యసాధ్యకార్యము కాదు.

సంగమకాలమున భార్యభర్త లిరువురు దేహమును మనస్సును నిర్మలముగ స్వస్థముగనుంచుకొందు రేని వారిబిడ్డలు వారియిరువురకంటె దేహమనోబలములు గలవారుగనుందురు. వారి యిరువుర దేహములు మనస్సులు నిర్మలములు స్వస్థములు గాకుండిన. వారి యిరువురకంటె దేహమనోదౌర్బల్యము గల బిడ్డలు పుట్టుదురు. ఇట్టి రకముల విత్తనములు సారవంతము నిస్సారమునైన భూముల నాటి పరీక్షింప వచ్చును.

సంగమకాలమునఁ గడుపు నిండియుండరాదు. పైత్యకోశ మద్దగింపఁబడి యుండరాదు. శ్వాసకోశములు ముడుచుకొని యుండరాదు. మెదడునకు నొత్తుడుతగిలి యుండరాదు. ఇంతయేల యన్ని యవయవ ములు నింద్రియములు సామ్యస్థితియందుండవలయును. పడుకటింటియందలి పదార్థము లలంకారములు మనస్సున కాహ్లాదము కలిగించునవిగ నుండవలయును గాని యుద్రేకమును మనోవికారమును గలిగించు నసహ్యపదార్థములై యుండరాదు. వేశ్యల యిండ్ల యందువలె అంకుటాండ్ర పటములు నగ్నస్త్రీల పటములు నుండరాదు. చూచిన వెఱపు జుగుప్స కలిగించు పటము లుండరాదు. ఇంటి యందు మంచి గాలి ప్రసరించుచుండవలయును. అదియేమి పాపమోగాని గర్భాధానదినములందు గది యన్ని వాకిండ్లు కిటికీలు మూసివేయవలసివచ్చుచున్నది. ఏల? యాఁడువారి పోరువలన. వారి యభిప్రాయమేమో కాని గదిలోని దంపతులేమిచేయుచున్నారో చూడవలయునని యాఁడువాండ్రు గదిపదివైపులందు ముసురుకొని యుందురు. దానివలన గాలివచ్చు రంధ్రములన్నియు మూసి వేయవలసివచ్చుచున్నది. దినదినము మీ మగఁడు మిమ్మేమి చేయుచున్నాఁడో యా కార్యమే జరుగునని పచ్చిగఁ జెప్పినను వినరు. గడతేఱిన వెండ్లికొడులు పెండ్లాము నేమిచేసెదనో తెలియవలసియుండినవారు లోపల వచ్చిన మీకే యా పనిచేసి చూపెదననియు నందురు. ఏమిచేసినను వారేమో వదలిపోరు. కావున నా మూఁడు రాత్రులందును దంపతుల కేకాంతవాసశిక్షయే. ఇట్టి గదియందు ముఖ్యముగ గది చిన్నదైనచో దీపముంచుట యపాయకరము. ఇంటియందు సువాసనగల పుష్పములు పదార్థము లుండవలయును. గర్భము నిలుచు తత్కా లమునఁ దటాలున నేది తలంపునకు వచ్చునో యేది కనులకు వీనులకు మనస్సునకు గోచరించునో దా ననుసరించి మంచిగనో చెడ్డగనో యవయవమునందో గుణమునందో మనస్సునందో యాకారమునందో యెక్క డనో యొకచోట నేదో యొక విధముగ ఫలము గానవచ్చును. భార్యాభర్తల కంటికెదురుగ పందిపిల్లలు, కుక్క లు, దున్నపోతులు పులులు నిట్టి బొమ్మలుంచిన నట్టి బిడ్డలే పుట్టుదురు. రతి మన్మథులవంటి బొమ్మలుంచిన సుందరమూర్తు లుదయింతురు. సీతారాములు నలదమయంతులు, చంద్రమతి హరిశ్చంద్రులు, దేవతావిగ్రహము లుంచిన నా యా గుణములు రూపులు గలవారే యుదయింతురు. ఊరక యుంచినంతమాత్రమునె ఫలము లేదు. భార్యాభర్తల మనస్సుల,

అందు ముఖ్యముగ భార్య మనస్సు వానియందే యుండవలయును. గదియందు దీపముండరాదని దీపపువెలుతురునఁ గలియరాదని యంటివే ఈ ప్రతిమ లుండి యేమి ప్రయోజన మందురేమో, చిన్నగది యందు దీప ముంచవలదను టకుఁ గారణము ప్రాణవాయువు నెల్ల నదేహరించి యంగారక్షారవాయువును విడుచుటచే నా విషవాయువును దంపతులు పీల్చవలసివచ్చుననుట, దీపపు వెలుతురున రమింపవలదంటినిగాని యింటియందే దీప ముంచవలదని నేను జెప్పలేదు భార్య దేహముపై వెలుతురు పడకుండునట్లును తక్కి న పదార్థములపై వెలుతురు పడునట్లు దీప ముంచవచ్చును. ప్రథమ గర్భాధాన కాలమున పడుకటింటియందు మధురాహారములు పెక్కు లుంచుదురు. వీని నెదురుగ నుంచుటకన్న చాటున నుంచుట మేలు. వీనిపై భార్యకు మనస్సుపోయెనా తిండిపోతు బిడ్డలు పుట్టుదురు. పురుషుఁడు తినవలయునని కోరినను దన స్నేహితురాండ్రు బంధువులు పరిహసింతురని భార్య యీ పదార్థములఁ దిననీయదు. తత్పూర్వము వీఁడు కడుపునిండ భుజించి యుండినయెడల వీనిని భుజింపకుండుటే మేలు. పూర్వ మాహార మభావమై యిదియును దినుటకు లేకపోయిన నిషేకదిన యేకాదశి శివరాత్రి రెండును గలసి నట్లగును. ఇట్టిదికూడఁ గలదా యందువేమో. నా విషయమై చెప్పెదను. ఆత్మ శ్లాఘా పరనిందా వాక్యములతోను దబ్బఱలతో నిపుడు స్వచరిత్రములు వెలువడుచుండుటచే స్వచరిత్రములకు గౌరవము లేదుగాన నా విషయమై నే నేదియుఁ జెప్పనొల్ల. ఐనను నేను జెప్పునది యాత్మశ్లాఘ కాదు. పరనింద కాదు. అసత్యము కాదు. కావున సందర్భోచితముగ నుండుటచే నిట్టి పొరపాటులు నీ విషయమునఁ గలుగకుండవలయునని చెప్పుచున్నాను. చదువువారి కిది ప్రహసన మగును గాక !

గర్భాధానము నా యిరువదియైదవయేట జరిగెను. నేనెప్పటికిని మితభోజినే కావున ముహూర్త దినము నుదయమున మితముగానే భుజించితిని. నాకు మధ్యాహ్నమున ఫలాహారమని 10–12 అత్తిరసముల దొంతియాకులోఁ బెట్టఁబడెను. నాకు వానియం దభిరుచి లేదు. కావున మర్యాదకని యొకదానిలో సగము తినునప్పటికే బ్రహ్మప్రళయముగా నుండెను. ఈ రాశి యెప్పుడు సమయను ? ఎప్పుడు గడ్డనఁ బడుదునని “లేరే దీనుల మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్” అనుకొనుచు దైవధ్యానము చేయుచునోరు కదలించుచుంటిని. ఇంతలో నా పిన్నతండ్రి లక్ష్మాజీరావుగారు నన్ను “సుబ్బన్నా ! యేమి చేయుచున్నావు. ఇట్లురా” మ్మని పిలిచెను. నేను జేయు కార్యమెట్టిదో యాయనకుఁ దెలియదు. దూరమున మఱుఁగుననుండి పిలిచెను. మే మిరువురము కూడనున్నప్పు డేకార్యమైన నాతో నాలోచింపక యాయన చేయఁడు. కావునఁ గార్యవశమున నాయన నన్నుఁ బిలిచెను. ఇదే నెపమని బ్రతికితిని దేవుఁడా యనుకొని యిదిగో వచ్చితినని ప్రత్యుత్తరమిచ్చి నోట మాట యుండఁగానే చేతితో నుత్తరాపోశన మెత్తికొని లేచి పోయితిని. ఆ రాత్రి 8 గంటలకు గర్భాధాన ముహూర్తము. ఈ లోపలఁ బూర్వాంగ కార్యములన్ని జరగవలయును. నా భార్య ముందుగనే భోజనము చేసియుండెను అల్లునివంట యాలస్యమయ్యెను. 7 గంటలు దాఁటి పోవచ్చెను. అప్పుడేదో యయినంత మాత్రము నా కాకులో వడ్డించిరి. మొదటియన్నము తింటిని. రెండవసాధకము కలుపుకొని తినుచుంటిని. ఇంతలో వేళయయినది రమ్మని తొందరచేయుచున్నారని పిలువవచ్చిరి. అంతతో నుత్తరాపోశన మెత్తితిని. పాతికకడుపుకూడ నిండలేదు. పడుకటింటిలోని పదార్థములను దినఁబోయిన నా భార్య తిననీయలేదు. కిటికీ తలుపు బిగించియుండుటచే గాలివచ్చు మార్గము లేదాయె. తరువాతఁ గొంతసేపటికి నిద్రపోదమని తల్పముపై శయనించితిని. కన్ను పూర్ణముగ మూసినవాఁడను గాను. నీవు నిజమను కొందువో యబద్ధమనుకొందువో గాని దుప్పటి కానరాకుండ నల్లులు క్రమ్ముకొని నన్నుఁ బీఁకుకొని తినసాగెను. దానికంటెను పల్లేరుకాయల పాన్పు సుఖముగ నుండునని తలంచితి. వాని ధాటికిఁ దాళఁజాలక మంచము దిగి పై యంగ వస్త్రము పఱుచుకొని క్రింద పండుకొంటిని. అక్క డఁగూడ నన్నవి వదలినవి కావు. ఇంతలోఁ దెల్లవాఱెను. నా భార్య హాయిగ సుఖనిద్ర చేసెను. నేను మాత్రము యథాశక్తి నల్లులతోఁ బోరాడుచుఁ గొట్టుకావలి కాచితిని. అప్పుడొక పద్యము వ్రాసితినిగాని యంతయు మఱచితిని. “నల్లుల, నెత్తుటిచాఱలే చిత్తరువులు” అనునది యొక పంక్తియును “చాలనల్లుల పొలము శయన తలము” అనునది యొకటి జ్ఞప్తికి వచ్చినది. ఇట్టి యనుభవము నీకుమాత్రముగాదు. నా పగవానికిని గలుగకుండును గాక. ఇది జరిగి 30 సంవత్సరములైనను ఆ రాత్రి జరిగిన ప్రతివిషయ మచ్చొత్తినట్లు మనస్సున నున్నది. మంచి విట్లు శాశ్వతముగ నిలువవు. దేవతావిగ్రహమును యథాస్వరూపము మనస్సున నిలుపవలయుననిన దుష్క రము. నగ్న స్త్రీపటములు జ్ఞప్తినుండి తొలఁగి పొమ్మనినను బోవు. చెడువిషయము లొకసారి గోచరించినను మిగుల హానికరము లగుటచేతనే వానిని పెద్దలు పూర్ణముగ నిషేధించిరి.

గర్భధారణకాలమునఁ దల్లిదండ్రుల దోషముచే గర్భములకుఁ గలుగు గుణదోషములు శిశు

వుదరంబున నున్న కాలమున గుణాగుణములచే హెచ్చు కావచ్చును తగ్గవచ్చును. శిశువు గుణాగుణములచే హెచ్చు కావచ్చును తగ్గవచ్చును. శిశువు కడుపులోనుండఁగఁ దల్లి దేహమునకు మనస్సునకుఁ గలుగు సుఖ దుఃఖములు శిశువునకు మేలు గీళ్ళను గలిగించును. తల్లి మనోవ్యాపారము లనఁగా కోపము దుఃఖము నిరుత్సాహము లోనైనవి శిశువు మనో వ్యాపారములఁ జెఱుచును. కాయిముకలైన జీర్ణించుట, రక్తము ప్రసరించుట, శ్వాసము విడుచుట, మలమూత్ర విసర్జనము వీనియందలి దోషములచే బిడ్డకుఁ బ్రాణముపట్టుట చలనము తగ్గును. తొలి చూలు బిడ్డలు బుద్ధిబలము చాలనివారుగ నుండుటకు వారి తల్లిదండ్రుల ప్రథమ కామావేశవేగమున నిచ్చవచ్చినట్టు చరించుటే కారణము.

గర్భము నిలిచినపిమ్మట తండ్రి గుణదోషములు శిశువునంతగా బాధింపవు గాని తల్లి నిద్రాహార విహారాదులందలి గుణదోషములు బిడ్డపుట్టి పాలువిడుచువఱకు దానికి సాధకములుగానే యుండును. గర్భము నిలుచుకాలమున తల్లిదండ్రులిరువురు తమ గుణములను గొంచెమో గొప్పో బిడ్డతు సమర్పింతురు. అందొక రెక్కు వగను మఱియొకరు తక్కు వగనిచ్చెదరు. గర్భము నిలిచినతరువాత తల్లిగుణదోషములు మాత్రమే బిడ్డకు పట్టుపడు చుండును. బిడ్డ బలశాలిగా నుండవలయునని తల్లి బిడ్డ నుద్దేశించి మేలు తలంచుచు బిడ్డ బలవంతుఁడ నియే భావించుచుండెనేని తప్పక బలశాలియైనబిడ్డయే కలుగును. ఇట్టులే నీతిమంతుని భక్తుని ధర్మశీలుని నగు పుత్రుల ధ్యానించిన నట్టివాఁడే పుట్టును. ఈ కాలమునఁ దల్లి కేది బాధకమో యది తప్పక బిడ్డకు బాధకమే. తల్లి మొఱటు తిండితినిన బిడ్డకు గండమాలరోగము వచ్చును. ఊరక కూర్చుండుటవలన, బిడ్డలు నరములు బలహీనముల గును. శ్వాసము చక్క గాఁవిడువకుండుటచే రక్తము లేక చిక్కి యుండును. రస గంధకాదులు తినుటచే శ్వాసకాసము క్షయము లోనగు రోగములు కలుగును. కొయనా తిన్నయెడల చెవులు కన్నులులోనగు బహిరింద్రియముల పాటవము తగ్గును. విశేషముగ నుప్పుకారము కలసిన గాటువస్తువులు తినిన పైత్యపు గుల్మములు గుల్లలు మొదలైనవి లేచును. ఉక్కు ద్రావకములోనైనవి తీసికొనిన బిడ్డ దేహస్వాస్థ్యమంతయు జెడును. ఇనుముకలసిన యౌషధములను దంపతులు దీర్ఘ కాలము సేవించిరేని బిడ్డల కున్మాదములు మూర్ఛలు కలుఁగును. నొప్పులు మొదలైనవి తగ్గించుకొని నల్లమందు మొదలైన వస్తువులు తినిన బిడ్డ పైత్యకోశము మలమూత్రకోశము చెడును, ఎక్కు వ కష్టము చేసినను సర్వదా యలసినట్లుండినను బిడ్డ యవయవములు ఆకారము సౌష్ఠవము లేక పరిమాణ ప్రకార ముండదు. పెరటాశి శనివారమునాఁడు పార్థసారధి కోవెలయొద్దఁ గానవచ్చునట్టివారు పుట్టుదురు. భయము పుట్టించు కథలు చదువుట వినుట భయంకరమైన వానిని వికారాకారములను జూచుట చింత దుఃఖము అసౌఖ్యకరమైన గృహము దయ లేని యత్త, బుద్ధిమాలిన యడకత్తులవంటి యాఁడుబిడ్డలు బాధపడుబిడ్డ, యివి యన్నియుఁ దల్లి మనస్సు స్వాస్థ్యము చెఱుచుటచే బిడ్డలకును హానికరములు. ఇవియే యిటులుండ నిఁకఁ దల్లులు కాఫీనీళ్ళు, తేనీళ్లు మొదలైనవి కూడఁ ద్రాగిరేని బిడ్డల వైభవము చెప్పఁబనియే లేదు.

ఈ వాస్తవ విషయమును బట్టి చూడ బిడ్డలు బాగుండ వలయునని కోరువారు తల్లికి సుఖమును సంతోషమును గలిగించు చుండవలయును. ఇది తల్లి చనుఁబాలు బిడ్డఁడు విడుచు వఱకే గాక వారి వారి యనుకూలము కొలఁది యెంతకాలము వఱకు వ్యాపింపఁజేసిన నంత క్షేమమే. ఒక తల్లి యందొక్క తండ్రివలనఁ బదుగురు బిడ్డలు పుట్టిన నందఱు నన్నివిధముల దేహమనస్థితిగలవా రగుటకు గర్భధారణకాలమున భార్యా భర్తల దేహమనస్థితులందును, దరువాతఁ దల్లియందును గలుగు భేదములే కారణము. విధి విరామము లేక దంపతులు వారివారి యిష్టము వచ్చినట్లు సంగమించుటచే వారి బిడ్డలును బలు తెగలవారు పుట్టుచున్నారు.

గర్భిణీగానుండు కాలమున స్త్రీ చీరబిగించి కట్టరాదు. బరువైన చీరలను గట్టరాదు. రవిక బిఱ్ఱుగ నుండరాదు. గుండీల రవికలు దొడుగుకొనువారు మెడగుండీ బిఱ్ఱుగ బిగింపరాదు. సొగసునునదియు త్తప్పుడే యారోగ్యము చెఱుచు నదిగా నుండరాదనిన నిఁక నట్టిసొగసు బిడ్డను బాధించునది యగునేని యది దానిపాలి కురి యని వేఱ చెప్పవలయునా ? జ్ఞానములేనివారు సొగసుకత్తెలును వదరు కూఁతలను వివేకము గల స్త్రీలు పాటింపరాదు. కమలాఫలములు. సీమ రేఁగుపండ్లు, అంజూరపుపండ్లు మొదలైన మంచిఫలములు తినయును. బరువులెత్తరాదు. గర్భిణీహితచర్యయందు దీని విశేషించి వ్రాసియున్నాను.

భార్య గర్భిణిగానుండు సమయంబున భర్త యామె విషయము మిక్కి లి దయ హెచ్చరికగలిగి ప్రవర్తింపవలయును. తెలివిమాలిన స్త్రీలు గొందఱు తొలిచూలు వేఁకటిపడుచులను తేరకు భయపెట్టుదురు. ఏదియో కొంప మునిఁగిపోవు నంతటి విపత్తు వచ్చినట్టు వర్ణింతురు. తా మెట్లెట్లో యా గండము

తప్పించుకొంటిమందురు. ఈ కాలమున నాగరికతా వ్యాధి ముదురుటచే బాలింతల కపాయములు కలుగుచున్నవి గాని గర్భిణీ హితచర్యయందు నేను జెప్పినట్లు ప్రవర్తించు చుండువారి కే యపాయమును గలుగదు. వేదనలేని ప్రసవము కలుగును. ఈ విషయము గర్భిణీ హితచర్యయందు విశదీకరించితిని. స్వభావసిద్ధమైన కార్యములను అపాయకరములైనవిగ భగవంతుఁ డేనాఁడును జేయఁడు. మన తెలివితక్కు వ తనముచేత స్వభావమునకు విరోధముగ నడచి యపాయములు కలిగించుకొనుచున్నాము. గర్భిణీస్త్రీల భయము మంచిమాటలచేఁ దీర్పవలసినది భర్తకు విధి గర్భసంబంధమైన శరీర శాస్త్రము ముందుగనే తెలిపియుంటివా ? చాలమేలు. ఆ జ్ఞానము భయమును బాపి కర్తవ్య మెఱిఁగించి మేలిచ్చును. అటు లేకపోయెనా యా విషయము చెప్ప నిది సమయము గాదు చక్క ఁగఁ బనిచేయుచు నెండకు గాలికిఁ దిరుగుచుండు నెఱుకలు, ఏనాదులు, వడ్డెలు ఏమాత్రము కష్ట మెఱుఁగక సద్దు చప్పిడి లేక ప్రసవించుట మనము కన్నులారఁ జూచుచున్నాము కదా. మన యాఁడువారి సోమరితనము, వగల మారితనము, తిండిపోతుతనము, పనికిమాలిన సొగసులు, ప్రసవమును కష్టమును అపాయముతోఁ గూడినదిగను చేయుచున్నవి.

గర్భధారణకాలమున స్త్రీలకు దేహము దుర్బలముగా నుండును. కావున విపరీతపు దయగల పెద్దవారు వారిని పనులు చేయనీక యూరక కూర్చుండఁ బెట్టుదురు. ఇది మిక్కి లి తప్పు దేహము దాఁపక విశేషము బడలనీయక పనులు చేయుచుండ వలయును. దేహమునకు గాసి తగులనీయరాదు. ఈ దుర్బలతకు మొదటికారణ మజీర్ణము అజీర్ణ మీ కాలమున హెచ్చుగుటకు రెండు కారణములు. రెండు ప్రాణులు జీవించుకొఱకు ఆహార మెక్కు వగాఁ దినుట. గర్భము పెరుఁగుటచే జీర్ణకోశ మిఱుకైపోవుట. అజీర్ణవ్యాధి గలవారికి మనస్సు ప్రసన్నముగా నుండదు. కావున నీ సమయమున స్త్రీలును శాంతమనస్క లు గాకుందురు. వారి మేలుగోరు భర్తలు దానిని సహింపవలయును. తక్కి న సమయములందువలె ఈ కష్టము మందులతోఁ బోవునది కాదు. ప్రసవించు వఱకుండునదే. ఇది గర్భము పెరుఁగుట చేతను లోపల శిశువు కదలుటచే గలుగు నొత్తుడు చేతను గలుగును.

మితముగా కాలోచితమైన దేహవ్యాయామమే దీనికి సరియైన యౌషధము. మంచిగాలిలో దినమున కొకపార్యయ మొకరిద్దఱు గలిసితిరుగుట లాభకరము. ఏ విధముగనైన వారి యప్పటిస్థితియందు మనస్సు పోనీయ కుండ భర్తలు చేయుట బాగు. స్త్రీలు తమవిషయమై భర్తలతోడను జెప్పరు. కావున భర్తలే యీ విషయములన్నియుఁ దెలిసికొనియుండి క్రుచ్చి క్రుచ్చి ప్రశ్నించిన వారుత్తరము లిత్తురు. లేకుండిన మగవారి కేమి తెలియును? ఏమి చెప్పి యేమి ప్రయోజన మని యుపేక్షింతురు. కొందఱు సిగ్గుచేతను జెప్పరు. ఈ కాలమున వైద్యసాహాయ్యము గావలసియుండెనేని భర్త ధనము వెచ్చింపఁ బ్రాలుమాలరాదు. ఏవిధముననైన సరియే వారికి జడుపు విసుఁగు ఆయాసము కలుగకుండ కాపాడవలయును. అత్త లాడుబిడ్డలు మనస్సులకు వ్యాకులత కలిగించుచుండిరేని గర్భిణిని వెంటనే పుట్టినింటికిఁ బంపుట మేలు. ఈ కాలమున భర్త వివేకముగలవాఁడైనచో భార్యసమీపమున నుండుటే బాగు. తానుండియుఁ బ్రయోజనము లేనప్పుడు దానిని వేఱుగఁ బంపుటే క్షేమము.

గర్భధారణము, ప్రసవము, శిశుపోషణము సులభకార్యములని తలఁపకుము. ఆహార నిద్రా విహారములందు మితముగఁ జరించువారి కవి నిరపాయములైనను ఈ మూఁడు కార్యములవలన స్త్రీలు చాల దుర్బల లగుదురు. తమలో నుండు సారము బలము విశేషభాగము బిడ్డల కిచ్చుటచేతను గొంత గాసి చేతను వ్యయపెట్టుదురు. కావున నొక కాన్పునకు మఱియొక కాన్పునకు నడుమ మూఁడు సంవత్సరములయిన నెడముండ వలయును. లేనియెడల స్త్రీల దేహము చెడును. బిడ్డలు చెడుదురు. అనఁగా నీ కాలమున భర్త 20 మాసములు బ్రహ్మచర్యవ్రతమును జరుపవలయును గాని యే రూపముననైనను వీర్యము వ్యర్థపఱుపరాదు. వీర్యము శక్తి, బలము, నీ వేమని తలఁచితివో యేమో ఒక చేరెఁడు వీర్యము 40 చేరల రక్తమునకు సమానము. రక్తము దేహము నుండి పోయిన నెంత నష్టమో నీకుఁ దెలియునుగదా. దానినిబట్టి వీర్య మొకబొట్టయినను వృధాపోవుటచే నెంత నష్టియో యాలోచింపుము. భర్త వీర్యము భార్యసొత్తనియు దానిని దుర్వ్యయపఱుచు నధికారము భర్తకు లేదనియు నెఱుఁగుము. దానిని భార్యయందే వినియోగపెట్టవలయును. అట్లుచేయుటకు వలనుపడనపుడు తమయందే దానిని జీర్ణింపఁజేసికొని యోజస్సుగా మార్పవలయునుగాని వెలి విడువరాదు. భార్యలేని వారు దానిని ఓజస్సుగా మార్చుకొని బాగుపడవలయును గాని, యితర స్త్రీలయందుఁ గాని పశువులయందుఁ గాని యితర విధములఁ గాని వ్యర్థ పఱుపరాదు. ఒక సారియైనను నితర స్త్రీల యందు రేతస్సు విడుచువాఁడు 3-4

విధముల ఘోరపాపమొనర్చినవాఁడగునని నమ్ముము. ముందు చెప్పిన విషయములు స్మరించితివేని కారణము స్పష్టమగును. వీర్యమును బుద్ధి పూర్వకముగ వ్యర్థపఱుచువాఁడు తనకును మఱియొక జీవునకునుగూడఁ గీడు కలిగించినవాఁడగును. ఆ పాపము వృధాపోదు. తనవంశము నభివృద్ధి చేయుటకై భార్య శ్రమించుచుండ మంచి మాటలచేతను ఉపచారములచేతను దాని మనస్సు సంతోష పెట్టుటకు మాఱుగాఁ దాను పరస్త్రీలతో సుఖించుచు దాని మన స్సాయాసపెట్టువాఁ డెంతక్రూరుఁడు. గర్భము ధరించిన కాలమున భార్యతో రమింపవచ్చునని కొందఱు శరీరశాస్త్రజ్ఞులు చెప్పిరిగాని యట్టి గ్రామ్యధర్మము వలన నొకవేళ దేహబాధ లేకుండినను ఇతర విధముల బాధ కలుగకపోదు. స్త్రీల కీ సమయమున సాధారణముగ రతిపై మనస్సు పోదు. కొందఱకు విపరీతవాంఛ కలుగును. అది రోగచిహ్నమని తలంపవలయునే కాని యారోగ్యమువలనఁ గలుగు కామ మనరాదు. స్త్రీ పురుషుల దేహమన స్థితులను బట్టి బిడ్డ మనస్థితి యుండునని ముందు చెప్పితిని గదా ? అట్లైనచో భార్యకుఁ గామోద్రేకము గలిగించి పురుషుఁ డామెతోఁ గ్రీడించెనేని శిశువునకుఁ గామాతురత్వము కలుగుటకు సందేహమేమి ? తల్లిదండ్రులు జారులు కాకున్నను బిడ్డల యందు జారత్వము కనఁబడుట కిదియే కారణము. వేఁకటివేళ భార్యాభర్తలు కలియరాదనుటకు గర్భస్రావమగుట, బిడ్డలకు మూర్ఛాదిరోగములు వచ్చుట లోనైనవి కారణములు కొన్ని గలవు గాని యందొక్క టైనను ప్రబలకారణము చాలును.

ఇష్టముకలవానికి బ్రహ్మచర్యము కష్టమని తలంపకుము. ఆరోగ్యము చక్కఁగాఁ గాపాడుకొనుము. ప్రాణాయామము మానకుము. ఆహారనిద్రలయందు మితము గలిగి వర్తింపుము. ఏకాదశి వ్రతము వదలకుము. ఒకనాఁడు భోజనము మానినను తక్కు వగ తినినను ప్రాణము పోవునని భయపడకుము. దేహపరిశ్రమము చక్కఁగఁ జేయుము. మనస్సున కేదియో యొక మంచిపని కల్పింపుము. ఊరక యుంచకుము కామోద్రేకకరములైన వానినెల్ల వర్జింపుము. ఊరక యుంచకుము. కామోద్రేకకరములైన వానినెల్ల వర్జింపుము. మర్మాంగములను జల్లనీళ్ళచే గడుగు చుండుము, వెల్లకిలఁ బండుకొనకుము. కఠినస్థలములఁ బండుకొనుము. ఈ ప్రకారము వర్తించు వానికి వీర్యస్ఖలనము కలయందైనను కలుగదని నేను దృఢముగఁ జెప్పుచున్నాను. ఒకవేళ నప్రయత్నముగనైనను హాని లేదు. కావున నటు చేయుటకుఁ బ్రాలుమాలి కామదాసుఁ డవై చెడకుము. ఇంద్రియ జయము గోరువానికి మితభుక్తి ప్రథమ కర్తవ్యము. పందివలె నే కశ్మలమైన నెన్ని మార్లైనఁ దినువానికి నింద్రియజయము దుష్క రము. అన్ని యింద్రియముల కుద్రేకరూపకరమైన వ్యాధి కలిగించునది యమితాహారము దుష్టాహారము. మితభుక్తిఁ గూర్చి పూర్వగ్రంథములఁ జెప్పియున్నాను. ఇట్లు బ్రహ్మచర్యమందుఁ బరించితివేని తరువాతఁ బుట్టెడిబిడ్డయు, దృఢగాత్రము, నారోగ్యము బుద్ధిబలము కలిగియుండును. ఇట్టి బిడ్డ లిద్దఱో ముగ్గురో కడకొకఁడైనఁ జాలును. వికలాంగులు రోగులు దుర్బుద్ధులు దుర్బలులు నూఱుగురు పుట్టిన లాభమేమి ? పందెండ్రేండ్లు గర్భము ధరించి యేనుఁగొక పిల్ల నీనును. పందిపిల్లలు గుంపులు గుంపులుగ పుట్టును. ఏది మేలు ? చచ్చీచావని నిర్భాగ్యపు బిడ్డలను సంవత్సరమున కొకటివంతునఁ గని దేశముపై విడుచువారు తమకుబిడ్డలకు దేశమునకుఁ బ్రజలకుఁ గూడ గొప్ప యపకారము చేసిన వారగుదురు.

నాయనా ! మీఁద నేను జెప్పిననన్నియు సత్యములో యసత్యములో యని నీవు సందేహింపవలదు. మీ యొద్దనే యొక రకము గడియారములను నలువురు కొనిపోయినఁ గొందఱాఱు నెలలలోనే మరలఁ జక్క జేయించుకొనుటకై తెత్తురు. కొందఱు 1-2 సంవత్సరములకుఁ దెత్తురు. కొందఱు 10-15 సంవత్సరములైనను జెఱపుకొనక వాడుకొందురు. ఎవరైన నీ గడియార మెన్నినాళ్లు పనిచేయునన నీవు వాడుకొను తెలివి కొలఁది యుండునని గదా చెప్పుదువు. గడియారముల ముల్లు వెనుకఁ ద్రిప్పు భయపడెద వేల? గడియారము చెడుననికదా? అట్టులే యీ దేహమే యొక యంత్రము. దీని లక్షణము తెలిసి యెంత హెచ్చరికగ వాడుకొనిన నంత బాగుగ దీర్ఘకాలము నడచును. లక్షణము తెలియక యశ్రద్ధతో నిచ్చవచ్చినట్టు పనిచేయించి జీవకళ నిర్మూలించిన శీఘ్ర కాలముననే చెడుటకును బనిచేసినంత కాలమైనను చక్క గఁ బనిచేయకుండుటకును అడ్డము కలదా?

కుమార హితచర్యయందు జన్మప్రయోజనము చెప్పునపుడు స్వభావవాంఛలు మూఁడని చెప్పితిని. అందాత్మరక్షణ వాంఛకంటె సంతానవాంఛ యుత్తమము. దానికంటెను మోక్షకాంక్ష యుత్తమము. దేహయంత్ర మీమూఁడు కోరికలు సుళువుగ నెఱవేఱుటకు దగినట్లు భగవంతుఁడు సృష్టించి మన కిచ్చెను. ఆ పద్ధతులకు విరోధముగ మనము తెలిసి నటించినను దెలియక నటించినను దేహయంత్రము విఱిగి పడుటే ఫలము అందు మొదటిదైన దేహరక్షణ పద్ధతుల నుపేక్షించినఁ గలుగు కీడులకంటె సంతాన లాభ పద్ధతులను నుపేక్షించిన నెక్కు

వ కీడుకలుగును. మోక్ష విషయము నుపేక్ష చేసితిమా తక్కిన రెంటి యుపేక్షవలనఁ గలుగు కీడులకంటె నెక్కువ కీడు కలుగును. ఏలయందువా విను. భగవంతుడు ప్రేమస్వరూపుఁడు. భగవన్మయము ప్రపంచమైనచో నది ప్రేమమయ మనుట నిరాక్షేపము. ప్రపంచ సృష్టిస్థితిలయములకుఁ బ్రేమయే కారణము. అట్టులే ప్రతి జీవి పుట్టుటకు బ్రతుకుటకుఁ జచ్చుటకు భగవంతుని ప్రేమయే కారణము. భగవంతుఁ డీ కార్యములను బ్రేమచేతనే చేయుచున్నాఁడు. ఉష్ణము వాయువు లేని పదార్థ మెట్లు లేదో యట్లు కొలఁదిగనో గొప్పగనో ప్రేమలేనిది లోకమున లేదు. మంచు గడ్డయం దుష్ణము కానరానట్టు కొన్ని స్థూలతమశరీరులందు నీ ప్రేమ వెలికి గోచరింపదు. కావుననే దేహమే తాననుకొను నజ్ఞానియుఁ బ్రేమచేతనే దానిని రక్షించుకొను చున్నాఁడు. ఇందుఁ బ్రేమ యల్పము. స్వవిషయము కావున నిట్టి ప్రేమను చక్కఁగ నుపయోగించినచోఁ గలుగు రోగాదిరూపక శిక్షయు నల్పమే. సంతానకాంక్ష నుపేక్షించినఁ గలుగు శిక్ష యనారోగ్యమునకుఁ గలుగు శిక్షకంటె తీక్షణమైనది. ఏల ? ఇక్కడఁ బ్రేమ కేవల స్వవిషయము గాదు. తాను బ్రేమించునది తన దేహముమాత్రమే కాదు. భార్యను బిడ్డలను ఆ సంబంధమున వారి బంధువులను. ఈ విధమునఁ బ్రేమావరణము విరివిచెందెను. ఇట్టి విస్తారప్రేమను బరులకు మేలుకలుగునట్లుపయోగింపక కీడుగలుగు నట్లుపయోగించిన శిక్షకుఁ బాత్రుఁడు కావలసినవాఁడే కదా. మోక్షాపేక్ష యందలి ప్రేమ యీ రెంటిని మించినది. మోక్షకామికి లోకులందఱుబిడ్డలే. అందఱు సోదరులే అందఱు తండ్రులే. జ్ఞానికి పరుల బిడ్డలయందుఁ దక్కువ ప్రేమయుఁ దనబిడ్డలయం దెక్కువ ప్రేమయు లేదు. మనుష్యు లెక్కువ యని వృక్షపశుపక్ష్యాదులు తక్కు వని యతఁడు తలఁపఁడు. సర్వమును దనవలెనే చూచుకొనును. అతనికి సర్వము భగవత్స్వరూపమే. కావున నంతయుఁ బ్రేమపాత్రమే. కావున భేదబుద్ధి తొలఁగుటచే హింస మానును. దానివలన నతని ప్రేమ మిక్కిలి విస్తారమగును. కావున నెక్కువ మేలుపొందును. ప్రేమ కెంతెంత విరోధముగ నడుచునో వాఁ డంతంత యెక్కువ కీడు నొందును. కావున బ్రహ్మచర్యాశ్రమమందుఁ బొరపడినఁ గలుగు కీడునకంటె గృహస్థాశ్రమంబునఁ బొరపడిన నెక్కువకీడు కలుగును. సన్న్యాసమందుఁబొరపడిన మిక్కిలి యెక్కువ కీడుకలదు. కనుకనే కదా యతిచెడిన గతిలేదందురు. అటైన నిప్పటి కుక్షింభర సన్న్యాసుల గతి యేమందువా? అధోగతియే. నడచువాఁడు పడిన నెంత దెబ్బ తగులునో చెట్టుమీఁదినుండిపడిన నెంతదెబ్బతగులునో గోపుర మెక్కి కూలిన నెంతదెబ్బ తగులునో యాలోచింపుము. నీవు గృహస్థాశ్రమమందున్న వాఁడవు. జాగ్రత్త జాగ్రత్త.

నీవు చెప్పినవి సత్యములే యగుఁగాక. అవన్నియుఁ జేయ నాకు సాధ్యమా ? యందువేమో. నీవు మనుష్యుఁ డవై బాగుపడవలయునని స్థిరమై బలమైన కోరికగల వాఁడవైనచో నేను జెప్పినవానియం దసాధ్య మేదియు లేదు. ఇంతకుఁ జెప్పఁదగిన దంతయు నేను జెప్పలేదు. కాలము ననుసరించి కొంచెముగానే చెప్పితిని. ఇప్పుడు నేను జెప్పినదంతయుఁ బాండిత్యమున కక్షరజ్ఞాన మెట్టిదో యట్టిదని తలంపుము. ఈ మాత్రము నీవు సాధించినఁ దక్కినవి యొకటివెనుక నొకటి లభించును. నీవు మనుష్యుఁ డవై యని యంటివే. నేను మనుష్యుఁ డ గానా యందువేమో ఆకారమున మనుష్యుఁడవైన నేమి కాకున్ననేమి? గుణమునందు జ్ఞానమునందు మనుష్యుఁ డైన వాఁడే మనుష్యుఁడు.

నే నారోగ్యమును జక్కఁగాఁగాపాడుకొనెద నందువా? జన్మప్రయోజన మది యొక్కటియే యైనచో నీకంటె పశువులు మేలు. మనుష్యునకు వచ్చునన్ని రోగములు తిర్యగ్జంతువులకు వచ్చునా ? రావు. ఏల? అవి తమకు విహితమైన యాహారముననే తినును భగవంతుఁడు సృష్టించిన మంచినీళ్లే త్రాగును. టీ కాఫీలు సారాయములు పొగాకులు లోనైనవి యెఱుఁగవు.

నేను సంతానమును బడసెదనందువా ? అది యొక్కటే జన్మప్రయోజనమైనచో నీకంటెఁ దిర్యక్కులే శ్రేష్ఠములు. పశువులం దెందైన ముండలరోగములు కలవేమో వింటివా ? కడుపులు దించుకొనునవి కలవేమో కంటివా ? ఋతుధర్మ మెఱుఁగక ప్రవర్తించునవి కలవేమో విచారించి చూడుము.

తక్కినవానికంటె మనుష్యుఁడు జ్ఞానమువలన శ్రేష్ఠుఁ డయ్యెను. అది కలిగి నీవు ప్రవర్తించిననే మనుష్యుఁడవు. అట్టి జ్ఞానము నీ కుండెనేని నేను జెప్పినదానియం దసాధ్య మేదియు లేదని తెలిసికొందువు. ఒక పురుషునకు సాధ్యమైనది మఱియొకనికి సాధ్యము కాకుండదు. ఇచ్ఛాశక్తి కొలఁది సాధ్యాసాధ్యము లేర్పడుచుండును. నే నందిందిట్టివాఁడు మనుష్యుఁడు కాఁడని చెప్పుటకు నాక్రోశము కారణము కాదని తెలిసి కొనుము. మనుష్యులం దుత్తమ మధ్య మాధములని మూఁడు తెగలవారున్నారు. అందొక్క తెగ మరల మూఁడు భాగములు. ఆ యొక్కొ

క్క భాగము మరల మూఁడు విధములు ఇట్లే యనేకాంతరాంతరములు గలవు. ఇందు మిశ్రమములు గలవు. పరీక్షయందు వేయిమంది కడతేఱిన మొదటివాఁడు కడవాఁ డొక్క టేయగునా? అట్టులే వృక్షజాతిలోఁ జేరినవి. జంతుగుణములు కలవియున్నవి. జీవజంతువుల భక్షించు వృక్షములు కలవుకదా. పుట్టగొడుగులు రాత్రులయందు సంచారము చేసి యాహారము నాకర్షించునఁట అట్లైనచో నివి యేజాతిలోఁ జేరినవి. అట్టులే జంతువులుగాఁ గానవచ్చియు వృక్ష స్వభావములు గలవి గలవు. అట్టులే మనుష్యస్వభావము గల పశువులు పశుస్వభావముగల మనుష్యులు గలరు. ఒక తరగతి నుండి మఱియొక తరగతికిఁ బోవునప్పుడు సంధియం దిట్టివి ద్విస్వభావము కలవి పుట్టును. మనుష్యగుణములు తక్కు వగను లెక్కు వగ నుండిన వారిని నీ వేతరగతిలోఁ జేర్చెదవు? పుట్టువు చేతనే మనుష్యుఁ డుత్తమ బ్రాహ్మణుఁడు గానట్టు పుట్టువు చేతనే దేహి మనుష్యుఁడుగాఁడు, సారాయము త్రాగి మాంసము తిని జూదమాడి యప్రమాణములు చేసి హింసారతుఁడైనవాఁడు బ్రాహ్మణుఁడా ? అట్టులే మనుష్య గుణము జ్ఞానములేనివాఁడు మనుష్యుఁడు గాఁడు. జ్ఞానమనఁగా మోక్షవిషయమైన తెలివి. అది యెంత యెక్కు వగునో మనుష్యుఁ డంతయుత్తముఁడగును. అది యెంత తక్కు వగునో వాఁడంత యధముండగును. జ్ఞానమనునది యనుష్ఠానపూర్వకమని యెఱుఁగును.

# వంధ్యాత్వకారణములు

స్త్రీలు పుత్రవతులగుట స్వభావధర్మము. బిడ్డలు లేకుండుటే స్వభావవిరుద్ధము. దీనికిఁ గారణములు కలవు. సాధారణముగా 10 మందిలో నొకతె బిడ్డలు లేని దుండును.

1. పూఁటకొకసారి పాతికకడుపునకైనా నాహారములేకున్నను తినునట్టియాహారము నిస్సారమైనను బిడ్డలు గలుగుటరుదు.

2. ఆహార మమితముగను, మిగుల వెలగలదిగను, మిక్కి లి సారవంతమైనదిగను నుండిన బిడ్డలు కలుగరు. ఈ కారణముచేతనే యిష్టమువచ్చినట్టు మంచి వెలగలిగి సారవంతమైన పదార్థమును అమితముగఁ దినుచుఁ గఁడలు క్రొవ్వు పెంచెకొనిన భాగ్యవంతులు సంతానము లేనివారగుచున్నారు. ఇట్టి వారికి దారిద్ర్యము పట్టెనా పదుగురు బిడ్డలు పుట్టుదురు.

3. భార్యాభర్తలు మితిమీఱి భోగించుచుండినను బిడ్డలు కలుగరు.

4. భార్యాభర్తలకుఁ గామాసక్తి యెక్కు వగ నుండినను బిడ్డలు కలుగరు.

5. భార్యతో సంగమించుటకుముందు భర్త దుస్స్త్రీలోలుఁడై గాని యితర మార్గములఁ గాని వీర్యము నష్టపఱచు కొని యుండిన బిడ్డలు కలుగరు.

6. సంతానవాంఛలేని స్త్రీలకు బిడ్డలు పుట్టుట యరుదు.

7. సంగమ సమయమున నతిసంతోషము వహించు స్త్రీకిని బిడ్డలు గలుగు టరుదు.

8. భార్యాభర్తల యంగముల లోపమువలన బిడ్డలు లేకుండుటయుఁ గలదు.

9. స్త్రీల గర్భకోశదోషమువలన సంతానము కలుగదు. కొందఱియందు గర్భకోశము స్థానమునుండి కదలియుండును. ముట్టుకుట్లు మొదలైనవి గర్భకోశదోషములే.

10. స్త్రీ పురుష లెంత యారోగ్యవంతులుగా నున్నను వీర్యమున జీవకణములు లేకుండిన సంతానము కలుగదు.

11. భర్తలు గర్భాధానమునకు ముందో వెనుకనో ముండల రోగములు తగిలించుకొని యుండిరేని యది నిమ్మళించి నట్టు పైకిఁదోఁచినను నీ భయంకరవ్యాధి దాని శేషమును అండకోశములో నిలిపియుండుటచే నది స్త్రీల గర్భములోఁ బ్రవేశించి గర్భమును స్త్రీలయండకమునుగూడఁ జెఱుచుటచే స్త్రీలయందుత్పత్తి కావలసిన దేహరూపకమైన యండకము నిస్సారవంతమై చెడును గావున గర్భము నిలువకపోవును.

12. భార్యాభర్త లొక్క విధమైన శరీరతత్త్వము గలవారై రేని గర్భము నిలువదు. ఏకగోత్రమువారును, సమీపరక్త బంధువులు భార్యాభర్తలైనచో పరస్పరాకర్షణము లేకయుండును. గావున గర్భము నిలువదు. వీరివంశము నిలిచిపోవును.

స్త్రీలకు 17, 18 వ సంవత్సరము మొదలు గర్భము నిలుచుటకు సరియైన కాలము, మన

